


కన్ను కంటిని చూస్తుందా? ప్రేలు ప్రేలిని తాకుతుందా? కత్తి కత్తిని కోసుకుంటుందా? నీరు నీటిని తడుపుతుందా? నిప్పు నిప్పును కాలుస్తుందా? నీవు చేయగలిగినదల్లా ఒకటే. నీవు నీ గత స్మృతులతోగల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. నీ మనస్సుతోగల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. నీ శరీరంతోగల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. నీ తలపులతోగల

తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. ఇలా వదలుకోవడానికి బ్రహ్మాండమయిన ప్రయత్నం ఏమీ చేయనక్కరలేదు. లేదా దీన్ని అర్థం చేసుకొనేందుకు తలక్రిందులుగా తపస్సు చేయనక్కర లేదు. కావలసిందల్లా సరియైన అవగాహన ఒక్కటే. నీవు చూచేదంతా, అనగా నీకు దృశ్యముగా ఉన్నదంతా నీవు కాదు. దృశ్యము ద్రష్ట కాదు. నిన్ను గురించి నీకు తెలిసిన దంతా నీవు కాదు. జ్ఞేయము జ్ఞాత కాదు. మరేమిటంటే – అది అంతరమున ఉండే 'నేను'. అది చూడలేనిది, నిర్వచింపబడలేనిది, నీకు దృశ్యముగా చేసుకొన వీలు లేనిది. బంధము అంటే ద్రష్టను దృశ్యములుగా ఉన్న వస్తువులుగా భ్రాంతి చెందటమే. ఈ తప్పిదాన్ని సరిదిద్దుకోవటంతో ముక్తికి దారి ఏర్పడుతుంది.

ఓం నమో భగవతే శ్రీరమణాయ

ఇప్పుడే ఇక్కడే ముక్తులం మనం

ఆంగ్లమూలం కెన్ విల్బర్

అనుసృజన ఒక రమణ భక్తుడు

రమణ భక్తమండలి ట్రస్టు, బెంగళూరు

ప్రకాశకుల మనవి

అనువాద గ్రంథమే అయినా ఈ లఘు కృతి ఒక అద్భుతమైన గ్రంథము. ఈ గ్రంథాన్ని ఒక పర్యాయం పఠించినంతమాత్రాన మనలోని జ్ఞాన నేత్రం తెఱపిడి పడుతుం దనటంలో సందేహం లేదు. సకల సంశయ విచ్ఛేద క్షమమై అజ్ఞానావరణాన్ని చీల్చి చెండాడగల ఈ గ్రంథం రమణ భక్తులలోని ఉత్తమ సాధకులకు ఒక అమృతకలశం.

దీనిలో రెండు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయం శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు బోధించిన సాక్షి వృత్తిని అభివర్ణిస్తుంది. వారి మాటలలో - "Pay attention - not accepting, not contradicting, not comparing. Do not run away from it, don't try to control it, don't try to sup- press it. Be choicelessly aware. It is choiceless awareness- Observation without judgement, watch anything with- out any prejudice, without any condemnation."

ఈ సాక్షి సాధన ద్వారా ద్రష్టకు, దృశ్యమునకు నడుమ ఉన్న దూరం అంతమై పోతుంది, ముక్తి కరతలామలకమవుతుందని చెప్పారు.

ఈ అధ్యాయాన్ని చదివితే నీ కోరికలు, నీ బాధలు, నీ ఆశలు, నీ దుఃఖాలు, నీ ఉద్వేగాలు - వీటిని నీవు ఆహ్వానించవు, వానితో పోరాడవు, వానిని వ్యతిరేకించవు, లేదా వానినుండి పారిపోవు, వానిని మార్చాలని ప్రయత్నం చేయవు, వాటితో కుస్తీలు పట్టవు, వాటిని అణచివేసేందుకు ప్రయత్నించవు, వాటికి సాక్షిగా వుంటావు, నిరపేక్షంగా, ఉదాసీనంగా ఇది సాక్షి భావన. దీని ద్వారా ముక్తికి దారి ఏర్పడుతుంది.

రెండవ అధ్యాయం భగవాన్ శ్రీరమణ మహర్షి స్వీయ అనుభవము ద్వారా బోధించిన సహజ సమాధి స్థితిని మనకు అలవడ జేస్తుంది. నిత్య సిద్ధముక్తియొక్క | స్వరూపం ఏమిటో, అది ఇప్పుడే ఇక్కడే ఎలా అనుభవంలోకి వస్తుందో, 'సముద్రము అలలు' దృష్టాంతం ద్వారా సరళంగా, సూక్ష్మంగా వివరించబడింది.
"ఆత్మ ఒక్కటే ఉన్నది. మనలను గుఱించి మనకున్న మిథ్యా భావనలనుండి దృష్టి మరల్చిన మాత్రంచేత ఆత్మను సూటిగా తేటగా అనుభవంలోకి తెచ్చుకోవచ్చు. ఈ మిథ్యాభావనలన్నీ సత్యాత్మను మఱుగుపరచేవి. 'అనాత్మ' అని పేర్కొనవచ్చు అన్నింటినీ కలిపి. ఆత్మ దేహానికీ, మనస్సుకూ పరిమితమై ఉన్నదనే | భ్రాంతి ప్రధానమయినది

ఇందులో. తాను ఒక వ్యక్తి మాత్రుణ్ణి అనీ, ఒకానొక దేహానికి పరిమితమై అందులో ఉన్నాననీ భ్రమించకుండా ఉంటే, కల్పితమయిన మిథ్యాసౌధం యావత్తు కూలిపోతుంది. శాశ్వత మయిన తన ఉనికిని గురించిన ఎఱుక, అంటే సత్యజ్ఞానము లభిస్తుంది. ఈ స్థాయిలో ప్రయత్నం అనేది లేదు. సాధన లేదు. ఆత్మ చేరవలసిన ఒక గమ్యం కాదు. అది కేవలం జ్ఞానం. అనాత్మను గురించిన పరిచ్ఛిన్న కల్పనలన్నీ త్యజింపబడినప్పుడు జ్ఞాన స్వరూపమైన ఆత్మ మిగులుతుంది. సాక్షాత్కారం క్రొత్తగా వచ్చేది కాదు. అది అదివఱకే ఉన్నది. 'నాకు సాక్షాత్కారం కాలేదు,' అనే తలంపును వదలించుకోవటమే చేయవలసిన పని. మనస్సు నశిస్తే జగత్తు నశిస్తుంది. మనస్సే దీని అంతటికీ మూలం. అది అణగితే సహజ స్థితి మిగులుతుంది. ఆత్మ ఎల్లప్పుడూ 'నేను, నేను' అని ప్రకటించుకుంటూనే వుంది. అది స్వయం ప్రకాశకము. అది ఇక్కడే వుంది. ఇదంతా అదే. మనం దానిలోనే ఉన్నాము. దానిలోనే వుండి దాన్ని వెతకటం ఎందుకు? జ్ఞానదృష్టి లభించిన వారికి అంతా సహజంగా వుంటుంది. స్వీయాత్మ కంటే వేఱుగా ఏముంది కనుక?" (రమణవ్యాఖ్య - 3వ అధ్యాయం.)

"మన ఋషులు అందుకే చెప్పారు ఆత్మను పొందలేవు, పొందే ఉన్నావు కనుక. ఆత్మను చేరే దారి లేదు, మనమే ఆత్మ కనుక. ఆత్మ పొందేదీ కాదు, పోగొట్టుకునేదీ కాదు. మనం ఆత్మయే అయి ఉండి, అది ఏదో అన్యమయిన | దైనట్లుగా పొందలేము. ఆత్మనీ చెంతనే ఉంది. నీవుగా ఉంది. నీవే అది. దానికోసం నీవు పోయి ఎక్కడో వెతక నక్కర లేదు. సత్యాన్ని అన్వేషించే వాడు ఆ సత్యమును ఎన్నటికీ కనుగొన లేడు." (పేజి - 21).

"ఆత్మను చేరేందుకు ఏ దారీ లేదు. ఆత్మ ప్రాప్తికి ఏ ఉపాయాలూ, ఏ సాధనా పద్ధతులూ లేవు. ఆ ఆత్మ సర్వత్ర ఉన్న తత్త్వము. సర్వదా ఉన్న తత్త్వము. సర్వమూ అదే. అది ఇప్పుడే ఇక్కడే వుంది. నీటికోసం ఒక వ్యక్తి ఒక అలమీద | నుండి ఇంకో అలమీదికి దూకినట్లుగా ఉంటుంది, సాధనల పేరిట మనం పడే కష్టం అంతా. మనం ఎప్పుడూ ఎటో చూస్తున్నాము. జవాబు ఇక్కడే ఉంది, కాని మనం ఆ జవాబు నుండి ప్రైదొలగిపోతున్నాము, దానిని కాదని వదలి పెడుతున్నాము. మనం ఎప్పుడూ ప్రక్కకు, ఇంకో వైపుకు, అంటే అవతలికి చూస్తున్నాము. ఇలా చేసినంత సేపూ మనకు నిత్యసిద్ధమై ఉన్న ఆత్మ. ఈ క్షణంలో మన అనుభవంలో ఉన్న ఆత్మ అనుభవ గోచరం కాదు. ఆత్మాన్వేషణ, అలాగే ఆత్మప్రాప్తికై మనలో ఉన్న కోరిక - ఇవే ఆత్మ సాక్షాత్కారానికి అడ్డుగోడ లవుతాయి. మనం ఎప్పుడూ నిత్యసిద్ధమై ఉన్న ఈ ప్రస్తుత క్షణంలోని మన అనుభవం నుండి ప్రైదొలగి పోతున్నాము. నిజానికి ఇప్పటి మన అనుభవంలోనే, వర్తమాన క్షణంలోని మన స్థితిలోనే, మన అన్వేషణకు పరిష్కారం దాగి వుంది. కనుక ఏం చెప్పాలంటే మనం మన లక్ష్యం కోసం వెతకటం లేదు. మనం మన లక్ష్యము నుండి పారిపోతున్నాము. (2 - 22).

'ఇప్పుడు' ఉన్న స్థితి సరియైనది కాదు అని మన దృఢాభిప్రాయము. అందుచేత 'ఇప్పుడు' మనం శాంతంగా ఉండము. ఇప్పుడున్న స్థితినుండి మనం నిరంతరం దూరంగా జరిగి జరిగి పోతుంటాము, అది ఇప్పటికంటె బాగుంటుందనే భ్రాంతితో. ఇప్పటి నీ అనుభవమునుండి దూరంగా జరిగిపోవటం అంటే ఇప్పటి నీ అనుభవమూ, నీవూ వేరు వేరు అని భావిస్తున్నావని అర్థం. రెండూ భిన్నమయినవిగా తోస్తాయి నీకు. 'ఇప్పుడు' నుండి దూరంగా నిరంతరం జరిగిపోతుండటం ద్వారా నీవు ఇప్పుడు కంటె భిన్నంగా ఉన్నావన్న భ్రాంతిని ఇంకా ఇంకా దృఢతరం చేసుకుంటున్నావు. 'ఇప్పుడు' నుండి దూరంగా పోవటం అంటే ఆత్మస్థితి నుండి మనం వేఱు అవుతున్నామనే అర్థం. (పేజి - 33).

'ఇప్పుడు' నుండి తప్పించుకోవడం ఆగిపోతే, ఇక మిగిలింది ఏమిటి? అంతా ఇప్పుడే. మరొకటి లేదు. ఆది లేదు, అంతము లేదు. వెనుక లేదు. ముందఱ లేదు. గత స్మృతులూ, భవిష్యదాకాంక్షలూ ఇవి అన్నీ వర్తమాన అనుభవాలుగా గోచరిస్తాయి. ఈ క్షణము, లేక 'ఇప్పుడు' అనే దాని సరిహద్దు గోడలు కూలిపోయి, అన్నీ ప్రస్తుత క్షణంలో ఇమిడిపోతాయి. అంతా వర్తమాన క్షణమే. మరొకటి లేదు. అలాగే అంతా 'ఇక్కడే' అయినప్పుడు నేను పోయేందుకు చోటు వేరే ఎక్కడా లేదు.

మనం దేన్ని అయితే తిరస్కరిస్తూ వచ్చామో అది అంతా నిత్య వర్తమాన కాలంలోని అవిభాజ్యమయిన అంశము అని తెలిసినపుడు అంతా ఒకే తత్త్వము. అన్నీ నిత్య వర్తమానములోని కదలికలే, సముద్రజలాలలోని అలలే. (పేజి - 36).

ఈ రకంగా సహజ సమాధి స్థితిని గురించి చక్కగా వివరించబడింది. పదే పదే అధ్యయనం చేసి, తద్వారా ఆత్మజ్ఞానానుభవమును పొందగలరనే ఉద్దేశ్యంతో ఈ గ్రంథాన్ని పాఠకులకు అందిస్తున్నాము.

ఈ గ్రంథ ప్రచురణకు అనుమతించిన అనువాదకులైన 'ఒకరమణ భక్తుడు'గారికి కృతజ్ఞతలు. అత్యంత భక్తి శ్రద్ధలతో డి.టి.పి. చేసి యిచ్చిన శ్రీ గరిమెళ్ల వెంకట సత్య సూర్య సుబ్రహ్మణ్యం గారికి, సకాలంలో రమణీయంగా ప్రింటు చేసి యిచ్చిన ఉదయ్ ప్రింటర్స్, హైదరాబాదు అధినేత శ్రీ కడియాల ప్రభాకర రావు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

-ప్రకాశకులు

# విన్నపము

"ఇప్పుడే ఇక్కడే మనం ముక్తులం," అనే ఈ లఘు గ్రంథము 'కెన్. విల్బర్" వ్రాసిన "నో బౌండరీ" (No boundary) అనే గ్రంథములోని చివరి రెండు అధ్యాయములకు అనుసృజన. కెన్. విల్బర్ "స్పెక్ట్రమ్ ఆఫ్ కాంషస్నెస్" (Spectrum of Consciousness) గ్రంథ రచయిత. ఈయన "కాంషస్ నెస్ ఐన్స్టీన్" (Consciousness Einsteen) అని కొనియాడ బడిన వాడు. ముఖ్యంగా భగవాన్ శ్రీ రమణ మహర్షి బోధలు గల 'టాక్స్' (Talks) అనే గ్రంథముయొక్క అమెరికన్ ఎడిషన్కు ముందుమాట వ్రాసిన వాడు. తాను ఏదయినా ఒకే ఒక గ్రంథాన్ని తన సంచీలో పెట్టుకొని వెళ్లవలసివస్తే ఆ గ్రంథము రమణ బోధామృతమయిన 'టాక్స్' అని చెప్పిన వాడు.

'నో బౌండరీ'(No boundary) అనే గ్రంథములోని అంశాలను (చివరి రెండు అధ్యాయములు) రమణ తత్త్వానికి అనువుగా మల్చుకొని, ఆ రీతిగా అనుసృజన యొనర్చిన గ్రంథం ఇది. రమణ తత్త్వసాధకులకు ప్రయోజనకరంగా ఉంటాయని ఈ రెండు అధ్యాయములను తగురీతిగా మార్చి, అనువదించి, రమణ భక్తులకు సమర్పిస్తున్నాను.

ఆంగ్ల గ్రంథం యొక్క కాపీని శ్రీ హేమంతకుమార్ (అడ్వొకేట్) విజయవాడ (సెక్రటరీ, రమణ భక్తమండలి, విజయవాడ) దయతో నాకు పంపారు. వారు లోగడ ఇదే రచయిత యొక్క "స్పెక్ట్రమ్ ఆఫ్ కాంషస్నెస్" అనే గ్రంథాన్ని పంపియున్నారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ప్రచురణకు స్వీకరించిన రమణభక్తమండలి (రి), బెంగళూరు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

సదా రమణ సేవలో
ఒక రమణ భక్తుడు.

# మొదటిపాఠమే చివరి పాఠం

'నేనెవడను?' అనే గ్రంథములో శ్రీ శివప్రకాశం పిళ్లై అడిగిన ప్రశ్నలకు భగవాన్ శ్రీ రమణమహర్షి చెప్పిన సమాధానాలున్నాయి. ప్రశ్నోత్తర రూపంలో ఉన్న ఆ గ్రంథాన్ని తరువాత భగవాన్ స్వయంగా ఒక వ్యాసంగా వ్రాశారు. ఆ గ్రంథంలో మొట్టమొదటి ప్రశ్న 'నేనెవడను?' దానికి భగవాన్ ఈ క్రింది విధంగా

జవాబు చెప్పారు. "సప్త ధాతువులచే నేర్పడిన స్థూల దేహము 'నేను' గాదు. శబ్ద స్పర్శ రూప రస గంధములను పంచ విషయములను వేర్వేరుగా తెలిసికొను శ్రోత్ర త్వక్ చక్షు జిహ్వా ఘ్రాణములనెడి జ్ఞానేంద్రియము లయిదును 'నేను' కాదు. వచన, గమన, ఆదాన, మలవిసర్జన, ఆనందములను నైదు కార్యములను జేయునట్టి వాక్కు, పాద, పాణి, పాయు, ఉపస్థలను కర్మేంద్రియము లైదును 'నేను' కాదు. శ్వాసాది పంచ వ్యాపారములను జేయు ప్రాణాది వాయు పంచకమును 'నేను' కాదు. తలచెడు మనస్సును 'నేను' కాదు. విషయ వాసనలతో మాత్రము గూడి సర్వ విషయములను సర్వ వ్యాపారములను వదలియుండు అజ్ఞానము 'నేను' కాదు".

ఇదే భగవాన్ శ్రీ రమణమహర్షి శివప్రకాశం పిళ్లైకి ఇచ్చిన జవాబు రూపంలో సాధకులకు చెప్పిన మొదటి పాఠము. ఈ మొదటి పాఠమే నిజానికి చివరి పాఠము కూడా. ఇంతకంటే సాధకునకు చెప్పవలసిన పాఠము మరొకటి లేదు - నిజానికి. అయితే, ఇంకా చాలా ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు కదా మహర్షి. చెప్పారు. అడిగితే చెప్పారు. ఇదీ అడిగితేనే చెప్పారు. అయితే జిజ్ఞాసువులకు ఈ ఒక జవాబే సరిపోతుంది, సాధన చేసేందుకు. ఇది పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకుంటే, ఇక అనుభవంలోకి తెచ్చుకునేందుకు ఏదీ మిగిలి ఉండదు. ఇదే ఆత్మానుభవమును కలుగజేస్తుందనేందుకు సందేహం లేదు. ఈ మొదటి పాఠమే చివరి పాఠం కూడా అవుతుంది.

భగవాన్ చేసిన ఈ ప్రథమోపదేశాన్ని అనుభూతిలోకి తెచ్చుకొనేందుకు మన సాధనను ఇలా మొదలుపెట్టవలసి ఉంటుంది. ముందుగా, ఈ పై పాఠముయొక్క సారాంశాన్ని ఈ క్రింది మాటల లోకి మార్చుకొని, దానిని నిదానంగా, మౌనంగా, మనస్సులో మననం చేస్తూ, అందులోని భావాలను ఒక టొకటిగా మన మనో నేత్రాలముందు వీలయినంత స్పష్టంగా నిలుపుకుంటూ, అందులోని సారాంశాన్ని హృదయంలో దృఢంగా నాటుకొనేట్లు చేసుకోవాలి.

"నేను ఈ దేహాన్ని కలిగియున్నాను. అంతేగాని నేను ఈ దేహాన్ని కాదు. నేను నా ఈ దేహాన్ని చూడగలను, భావించగలను. దేన్ని అయితే చూడగలమో, దేన్ని గురించి భావించగలమో అది దృశ్యము. నేను దానికి ద్రష్టను. ఈ దేహము అలసిపోవచ్చు లేదా ఉద్రేకానికి లోనుగావచ్చు. రోగగ్రస్తం కావచ్చు లేదా ఆరోగ్యంగా ఉండవచ్చు. లావుగా ఉండవచ్చు లేదా సన్నగా ఉండవచ్చు. బరువు ఎక్కువగా ఉండవచ్చు లేదా తేలికగా ఉండవచ్చు. కాని అంతర్గతంగా ఉన్న 'నేను'కు, వీని అన్నింటితో ఉన్న 'నేను' కు ఏ సంబంధమూ లేదు.

ఎందుకంటే - ఈ దేహం నాది, నేను ఈ దేహాన్ని కాదు. ఈ దేహం నాకు దృశ్యము, నేను దీనికి ద్రష్టను.

నాకు కోరికలున్నాయి. కాని నా కోరికలు నేను కాదు. ఇవి నా కోరికలు అని నేను తెలుసుకోగలను. తెలిసికొనబడేది ఏదయినా అది తెలిసికొనేవాడు కాదు. జ్ఞేయము జ్ఞాత కాదు. కోరికలు వస్తుంటాయి, పోతుంటాయి. నా ఎఱుకలో అవి అలలు అలలుగా సాగిపోతూంటాయి, తేలిపోతూంటాయి. ఈ కోరికలేవీ అంతరాంతరాల్లోని 'నేను'ను ప్రభావితం చేయవు, అవి నన్ను తాకవు. నాకు కోరికలున్నాయి, నేను కోరికలు కాదు.

నాకు ఏవో భావనలున్నాయి, కాని నేను ఆ భావనలు కాదు. నా భావనలు ఏవో అవి అన్నీ నాకు తోస్తున్నాయి, తెలుస్తున్నాయి. ఏవైతో గోచరిస్తున్నాయో, ఏవైతే తెలుస్తున్నాయో అవి నాకు ధ్యేయములు, నేను వానికి ధ్యాతను. ధ్యాత ధ్యేయము కాదు.

నాకు ఎన్నో తలపులున్నాయి. ఎన్నో మనోవ్యాపారాలున్నాయి. ఆ తలపులను నేను తెలుసుకోగలను. తెలియబడేది వేరు. తెలుసుకొనేవాడు వేరు. తలపులు ఎన్నో వస్తుంటాయి, పోతుంటాయి. అవి అన్నీ లోని 'నేను'ను ప్రభావితం చేయవు. నాకు తలపులున్నాయి. కాని నేను నా తలపులు కాదు."

ఇలా మననం చేయాలి ఎన్నో సార్లు చేయాలి. అలా మనస్సులో అనుకుంటూండగా, అనుకుంటూండగా, అవి అన్నీ నాలో దృఢంగా నాటుకుంటాయి. ఈ మనన ప్రక్రియ వల్ల నాకు అనుభవ గోచరమవుతుంది - ఏమని అంటే - వీనిని అన్నింటినీ కాదని, మిగిలి వుండే వాడిని 'నేను' అనీ, నేను ఎఱుకను అనీ, అన్నింటికీ కేంద్రమయిన జ్ఞానమును అనీ, తలపులు, కోరికలు, భావనలు - వీని అన్నింటికీ ఆధారంగా వుండి కదలక ఉండే సాక్షిని అనీ తెలియవస్తుంది.

ఈ విధంగా మననం చేస్తూ పోతే క్రమంగా అవగాహన పెరుగుతుంది. నిన్ను గురించిన భావనలో మౌలికమయిన మార్పు నీలో రావటాన్ని నీవు గుర్తిస్తావు. నీకు ఒకానొక స్వేచ్ఛ అనుభవంలోకి వస్తుంది. మనస్సు తేలిక పడుతుంది. విడుదల పొందినట్లుంటుంది. హృదయం స్తిమితపడుతుంది. నీ మూలములోకి నీవు అడుగిడతావు. ఒత్తిడులు తుఫాను గాలులు వీస్తున్నా, దుఃఖాల అలలు ఉవ్వెత్తున ఎగసిపడుతున్నా, లోపల తేటగా, నిశ్చలంగా ఉండే తత్త్వం ఒకటి ఉన్నదని స్ఫురిస్తుంది. సాక్షిత్వమనే కేంద్రం నీకు అనుభవ గోచరం కాసాగుతుంది. ఎత్తుగా లేచి విజృంభిస్తున్న అలల తాకిడిని తట్టుకొని, వానిలోనికి దూకి, తుఫాను యొక్క అలజడి వల్ల అల్లకల్లోలంగా ఉన్న సముద్రపు ఉపరితలం నుండి సముద్రపు లోతుల్లోకి మునిగి శాంతంగా, నిశ్చలంగా ఉండే అట్టడుగు భాగానికి చేరినట్లు ఉంటుంది. మొదట్లో మొదట్లో నీవు నీ ఉద్వేగాల అలల తాకిడిని తట్టుకొని నీ హృదయ సాగర జలాలలో కొన్ని అడుగుల లోతుల్లోకి మాత్రమే పోగల్గుతావు. అయితే అభ్యాసాతిశయ పర్యవసానంగా క్రమంగా నీవు బలం పుంజుకొని, ప్రశాంతంగా ఉండే నీ ఆత్మయొక్క అగాధాలలోకి మునిగి పోగల్గుతావు. ఆత్మార్ణవంయొక్క అగాధంలో అట్టడుగున వెల్లకిల చేతులు కాళ్లు చాచి పడుకొని ఉపేక్షా దృష్టితో ఉపరితలంలో గోచరమయ్యే అలల అల్లకల్లోలాన్ని వీక్షిస్తూంటావు నీవు. అంతకు ముందు నిన్ను నిలబడనీయక ఉక్కిరిబిక్కిరి చేసిన అశాంతియుత తరంగ సంక్షోభాన్ని గమనిస్తుంటావు.

శుద్ధమయిన ఏకాత్మ చైతన్యస్థితిని గురించి ఇక్కడ మనం చర్చించుకోవడం లేదు. మనం సాక్షి భావనయొక్క అభ్యాసాన్ని గురించి మాట్లాడుకుంటున్నాము. జ్ఞాన స్థితిలో చూచే దృశ్యజాత మంతా సాక్షితో సహా కుప్పగా కూలి పోతుంది. అక్కడ అంతా ఏకమే. ఆ స్థితి ప్రాప్తమయ్యే వఱకు నీవు మొదట సాక్షి చైతన్యమును అనుభవ గోచరం కావించుకోవాలి. అప్పుడు అది ఏకాత్మ చైతన్యానుభవ ప్రాప్తికి సోపానంగా ఉంటుంది. సాక్షి సాధనలో నీవు నీకు దృశ్యమాత్రములయిన భౌతిక, మానసిక, బౌద్ధిక విషయములన్నీ నీవు కాదని తెలుసుకొని, వానితో గల తాదాత్మ్య భావనను త్యజించి, వానికి నీవు కేవలం సాక్షి మాత్రుడవని గ్రహిస్తావు.

నీ ఉద్వేగాలు, నీ ఒత్తిడులు ఇవన్నీ నీవు కాదని ఏమేరకు నీవు అనుభవ గోచరం కావించుకుంటావో ఆ మేరకు ఆ నీ ఉద్వేగాలు, ఆ నీ ఒత్తిడులు నిన్ను బాధించకుండా ఉంటాయి. ఉద్వేగాలు ఉంటాయి ఒత్తిడులు ఉంటాయి. అవి మనోభూమికలో ఉంటాయి. మనస్సు నీవు కాదు కనుక, వానితో నీవు ముడిపడి లేవు కనుక, అవి నిన్ను తలక్రిందులు చేయవు. ఆ ఉద్వేగాలను నీవు ఆహ్వానించవు, వానితో పోరాడవు, వానిని వ్యతిరేకించవు లేదా వానినుండి నీవు పారిపోవు. నీకున్న ఉద్వేగాలను, ఒత్తిడులను, దిగుళ్లను,సమస్యలను ఉన్నవానిని ఉన్నట్లుగా నీవు అంగీకరిస్తావు, అవి ఎలా వస్తాయో అలా రానిస్తావు, ఎలా పోతాయో అలా పోనిస్తావు. వానిని వాని ఇచ్ఛవచ్చిన రీతిలో కొనసాగనిస్తావు. నీలో వచ్చే పరిణామం ఇది. నీకు వానివల్ల పోయేదీలేదు, వచ్చేదీ లేదు. అవి ఉంటే ఉంటాయి, లేకుండా పోతే పోతాయి. వాటిని ఊరక నీవు వీక్షిస్తుంటావు. ఉపేక్షా దృష్టితో వాటికి సాక్షిగా ఉంటావు.

ఏ ఉద్వేగమయినా, ఏ ఒత్తిడి అయినా, ఏ తలపయినా, ఏ గత స్మృతి అయినా, ఏ అనుభవమయినా, నిన్ను ఆందోళనకు గురి చేస్తున్నదంటే నీవు దానితో తాదాత్మ్యం చెందావని అర్థం. ఆ ఆందోళనతో నీవు తాదాత్మ్యం చెందకుండా, దానికి సాక్షిగా నిలిచి ఉండటమే దానియొక్క అంతిమ పరిష్కారం. మరొకటి కాదు. ఆ ఉద్వేగాలు మొదలయిన వాటి నన్నింటినీ అమాంతం క్రింద పడేయాలి. అవి ఏవీ నీవు కావు అని తెలుసుకో. ఎందుకంటే, అవి నీకు తెలుస్తున్నాయి. తెలియబడేవి వేరు, తెలుసుకొనేవాడు వేరు. దృశ్యము వేరు, ద్రష్ట వేరు. అవి నీవు కానప్పుడు, నీవు వాటితో తాదాత్మ్యం చెందాల్సిన అవసరమే లేదు. వాటిని పట్టుకొని కూర్చోవాల్సిన అవసరం లేదు. అవి పట్టి పీడిస్తున్నాయనీ, వాటిచేత నీవు బంధింపబడ్డాననీ భ్రాంతి చెందాల్సిన అవసరం లేదు.

2

ఇలా నిదానంగా, సున్నితంగా ఈ నేతి నేతి సాధన, ఈ సాక్షి సాధన చేస్తే, అది అద్భుతమయిన చికిత్సగా పనిచేస్తుంది. ఇంతదాకా ఉన్న జీవ భావన ఏమిటో అవగతమై, అంతట అది రాలి క్రింద పడిపోతుంది. ఏ జీవత్వ భావనను నీవు ఇన్నాళ్లూ రక్షించుకుంటూ, కాపాడుకుంటూ వస్తున్నావో అది క్రుంగి, కృశించి, నశించి పోసాగుతుంది. ఇలా చెప్పగానే అది అక్షరాలా మాయమై పోతుందని కాదు; నీవు ఇక దేహభావనను వీడి, గాలిలో తేలిపోతావు అని కాదు. లోగడవలె

కాకుండా ఇప్పుడు నీవు నీకు సంభవించే వాని అన్నింటినీ - నీ కోరికలు, నీ ఆశలు, నీ బాధలు, నీ దుఃఖాలు- వీనన్నింటినీ అంత ముఖ్యమయినవి కాదని భావించటం మొదలు పెడతావు. అవి ప్రాణాంతక మయినవేమీ కాదని తెలుసుకుంటావు. ఎందుకంటే- నీలోని లోతుల్లో ఒక తత్త్వం వుంది. అది పైపైన తోచే అనుభవాల స్పర్శ లేనట్టిది. పైన ఎగసిపడే అలల విజృంభణ యొక్క స్పర్శలేని సాగర గర్భంలాగా అది ఉంటుంది.

నీ శరీర ప్రాణ మనో బుద్ధులు బాధలకు లోనుకావచ్చు, అవమానాలకు గురికావచ్చు, భయాందోళనలతో సతమతం కావచ్చు. వాని అన్నింటికీ నీవు సాక్షిగా నిలిచి ఉన్నపుడు, అంటే గిరి శిఖరం మీద ఉన్నవాడు నేలమీద ఉన్న వాడిని చూస్తున్నవాడిలాగా ఉన్నప్పుడు, అవి నిన్ను ఇక భయపెట్టవు, బాధించవు. అప్పుడు నీవు వాటిని మార్చాలని ప్రయత్నం చేయవు. వాటితో కుస్తీలు పట్టవు. వాటిని అణచివేసేందుకు ప్రయత్నించవు. వాటికి సాక్షిగా ఉండాలనే ఆకాంక్ష నీలో నెలకొని ఉన్నపుడు వాటిని నిరపేక్షంగా, ఉదాసీనంగా చూడాలని భావించి ఉన్నపుడు, వాటిని నీవు అధిగమిస్తావు. వానికి అతీతంగా ఉండగల్గుతావు. ఉదాహరణకు నీ కళ్లు ఎఱ్ఱగా ఉన్నాయి అనుకో. అప్పుడు ఆ కళ్లు ఎఱ్ఱని వస్తువులను చూడలేవు. నీ కళ్ళు శుభ్రంగా స్వచ్ఛంగా ఉంటేనే అనగా ఎఱ్ఱగా ఉండకపోతేనే అవి ఎఱుపు రంగును చూడగల్గుతాయి. అలాగే మనం మన బాధలకూ, దుఃఖాలకూ సాక్షీభూతంగా వుండగలిగితే, మనం బాధా రహితులుగా, దుఃఖ రహితులుగా ఉన్నామని ఋజువు చేసుకో గల్గుతాము. మనం చూచే వాటియొక్క అలజడికి అతీతంగా ఉండగలమని నిరూపించుకుంటాము. మరో రీతిగా చెప్పాలంటే, బాధను అనుభవించే తత్త్వం బాధ లేనిదై ఉంటుంది. భయాన్ని పొందే తత్త్వం భయం లేని తత్త్వమై ఉంటుంది. మనం ఒత్తిడికి గురి అవుతున్నామని గ్రహించే తత్త్వం ఒత్తిడి లేనిదై ఉంటుంది. ఈ స్థితులకు సాక్షిగా ఉండటం అంటే, ఆ స్థితులకు అతీతంగా ఉండటమే. అవి ఇక నిన్ను వెనుకనుండి వచ్చి పట్టుకోవు, ఎందుకంటే, వాటిని నీవు ముందునుండి వీక్షిస్తున్నావు.

అజ్ఞానం అంటే ఏమిటో మన ఋషులు ఏనాడో అందుకే స్పష్టంగా చెప్పారు. విషయాలను గ్రహించే ఇంద్రియములతో ద్రష్ట అయినవాడు తాదాత్మ్యం చెందటమే అజ్ఞానం.

మనం ఇంద్రియ విషయాలతో, ఇంద్రియాలతో, అహంతతో తాదాత్మ్యం చెందిన ప్రతిసారీ వాటి అస్తిత్వానికి భంగం కలిగించేది ఏది జరిగినా అదంతా మనకే అనగా ఆత్మకే భంగింపజేసేదిగా గోచరిస్తుంది. తలపులతో, భావనలతో, అనుభవాలతో ఏర్పడిన తాదాత్మ్య భావనయే ఆత్మవిస్మృతి రూప శృంఖలాలలో మనం చిక్కేటట్లు చేస్తుంది.

మనం సాక్షిత్వ భావనా పరిధిలోకి పోయేకొద్దీ, మనకున్న వ్యక్తిగత సమస్యలు, ఆందోళనలు, దిగుళ్లు ప్రాధాన్యతను కోల్పోసాగుతాయి. అసలు మనం మన సమస్యలను పరిష్కరించే ప్రయత్నము కూడా చేయము, మన ఒత్తిళ్లను లెక్క చేయము. ఇప్పుడు మనం చేసే పని ఒకటే. మనం మన వ్యక్తిగత చింతలను వీక్షిస్తూంటాము, సాక్షిమాత్రులమై చూస్తూంటాము. అమాయకంగా, సూటిగా వానియొక్క ఎఱుకను కలిగి వుంటాము. వానిని గురించి మనం ఏ తీర్పు చెప్పము. వాని నుండి తప్పించుకోము. వానిని పెద్ద చేసి చూడము. వానిపట్ల శ్రద్ధ వహించము. లేదా అవి సరియైనవే అని నిరూపించము. ఒక తలపు రాగానే, ఒక భావన తలయెత్తగానే, దానిని మనం చూస్తాము. ఆ భావన పట్ల మనలో ద్వేషం ఏర్పడితే, దానిని కూడా చూస్తాము. అ ద్వేషం పట్ల మనకు ద్వేషం ఏర్పడితే దానిని కూడా చూస్తాము. మనం చేయవలసినది ఏమీ లేదు. ఒకవేళ మనం ఏదయినా చేస్తే, ఆ చేసే పనిని కూడా చూస్తాము. ఇలా చూడడం అంటే, 'చూపు'గా "ఎఱుక"గా ఉండటం, అన్ని ఒత్తిడుల నడుమ ఏ విధమయిన ఆసక్తి లేని ఎఱుకగా ఉండటం. ఈ ఒత్తిళ్లు, ఈ ఆందోళనలు - ఇవి ఏవీ మన ఆత్మకాదని తెలుసుకున్నపుడు ఇది సాధ్యమవుతుంది. వాని అన్నింటితోను మనం తాదాత్మ్యం చెంది ఉన్నంత కాలమూ, వానిలో తలదూర్చే ప్రయత్నం ఉంటుంది అది ఏ రూపంలో ఉన్నా గానీ. అవి ఏవీ 'నేను' కాదనీ, అనగా ఆత్మ కాదనీ తెలుసుకున్న క్షణంలో, ఆ ఆందోళనలను ఆ ఒత్తిళ్లను ఆ సమస్యలను చూసి మనం బెదరిపోము, వాటిని ద్వేషించము, తిరస్కరించము, వ్యతిరేకించము, వానితో పోరాడము లేక వానిని సహించి, ఇంతే అని సర్దుకొని పోము. మనకు ఎదురైన సమస్యను లేదా బాధను మనం పరిష్కరించాలని పూనుకొని మనం ఒక్క అడుగు ముందుకు వేసినా దానివల్ల మనకున్న భ్రాంతి ద్విగుణీకృతమవుతుంది, మనము ఆ సమస్య లేక ఆ బాధ ఒకటే అయివున్నామన్న భావన బలం పుంజుకుంటుంది. అదే విధంగా ఆ సమస్య నుండి లేదా ఆ బాధనుండి తప్పించుకొని పోయేందుకు ప్రయత్నిస్తే కూడా అది ఆ సమస్యను ఇంకా జటిలం చేస్తుంది. ఆ సమస్య జీవం పోసుకుంటుంది. మనకు అత్యంత బాధాకరంగా వుండే విషయాలు మనకు ఎదురైన సమస్యలు కాదు, మనం పొందే

కష్టాలు కాదు, వాటిపట్ల మనకున్న తాదాత్మ్య భావన, వాటి పట్ల మనకున్న ఆసక్తి లేదా వ్యతిరేకత. మనమూ ఆ సమస్య ఒకటి అనుకోవటమే అసలయిన సమస్య. అదే అసలయిన చిక్కు.

కనుక మనల్ని చుట్టుముట్టే సమస్యలను, బాధలను ఎదుర్కొనటానికి బదులు, వానిపట్ల మనం అనాసక్తిని, నిరపేక్షా భావాన్ని, ఔదాసీన్యాన్ని అవలంబించాలి. మన ఋషులు, జ్ఞానులు ఈ ఉపేక్షాదృష్టిని, ఈ సాక్షి భావనను ఒక అద్దంతో పోల్చారు. మనలోని తలపులను, ఉద్వేగాలను మనం ఊరక ప్రతిబింబిస్తాము; వానిని పట్టుకొని కూర్చోము లేదా వానిని త్రోసివేయము. అద్దం తన ముందు ఏది కదలిపోతున్నా దాన్ని పూర్తిగా నిరాసక్తంగా ప్రతిబింబిస్తుంది కదా! జ్ఞాని అయినవాడు తన మనస్సును అద్దంగా వినియోగిస్తాడు. అద్దం దేన్నీ గ్రహించదు, దేన్నీ త్యజించదు. అది ప్రతిబింబిస్తుంది, కాని దానిని తన వద్ద నిలుపుకోదు.

2

నీవు ఇలాంటి ఉదాసీన వైఖరిని, ఇలాంటి సాక్షి భావనను పెంపొందించుకోవటంలో విజయం సాధిస్తే (అందుకు సమయం పడుతుంది, నిజమే) అపుడు నీవు నీ శరీర ప్రాణ మనో బుద్ధులలో తోచే సంభవాలను నిరాకులుడవై, నిరపేక్షాభావంతో చూస్తావు. అవి అన్నీ ఎవరికో జరుగుతున్నట్లుగా, ఎక్కడో సంభవిస్తున్నట్లుగా భావిస్తావు. ఉదాహరణకు ఆకాశంలో మేఘాలు పోతూంటాయి, నదిలో నీరు ప్రవహిస్తూంటుంది, ఇంటి చూరునుండి వర్షపు నీరు కారుతూంటుంది లేదా నీ చిత్తాకాశంలో ఏవో దృశ్యాలు తోస్తుంటాయి. వాని అన్నింటినీ ఎలా వీక్షిస్తుంటావో అలాగే నీ మనశ్శరీరాల ద్వారా జరిగే సంఘటనలను కూడా చూస్తావు. "పశ్యత్యన్యశరీరవత్," అని అష్టావక్రగీతలో చెప్పబడిన మాట ఇదే. జ్ఞాని అయినవాడు తన భార్య పిల్లలు ఎవరికో సంబంధించిన వారుగా లేదా పూర్వపు బంధువులుగా భావిస్తుంటాడని జ్ఞాన వాశిష్ఠంలో చెప్పబడిన మాట కూడా ఇదే. లోకంలో ఇతరములయిన దృశ్యములతో నీ కెలాంటి సంబంధం ఉందో, అలాంటి సంబంధమే నీ మనశ్శరీరాలతో కూడా ఉంటుంది అప్పుడు. ఇప్పటిదాకా, లోకాన్ని చూచేందుకు సాధనాలుగా నీ మనశ్శరీరాలు నీకు ఉపయోగించాయి. అందుచేత నీకు వాటిపట్ల మమతానురాగాలు ఏర్పడ్డాయి. వానియొక్క పరిమితమయిన దృష్టికోణానికి నీవు బద్ధుడవై ఉన్నావు. వాటితో నీవు తాదాత్మ్యం చెంది ఉన్నావు. తత్ఫలితంగా ఆ మనశ్శరీరాల కెదురైన సమస్యలు, బాధలు, శోకాలు, మోహాలు అన్నీ నీవి అయినాయి. వానికి నీవు కట్టుబడి ఉన్నావు. వానికి బందీగా వున్నావు. కాని, నిశితంగా వాటిని పరిశీలించి చూసినపుడు, అవి కేవలం నీ ఎఱుకలో ఉన్న దృశ్యమాత్రములని నీకు తెలుస్తుంది. "ఈ మనస్సు నాది, ఈ శరీరం నాది, ఈ భావనలు నావి, కాని నేను మనస్సును కాను, శరీరమును కాను, భావనలు కాను," అని కూడా తెలుస్తుంది.

3

ఇందులో ముఖ్యమయిన ఆలోచన ఒకటే. నీవు నీ మనశ్శరీరాలకు కట్టుబడి ఉండవు. అవి నీకు సాధనములుగా ఉంటాయి. ముఖ్యమయినవిగా ఉండవు. ఈ ఉదాసీన భావాన్ని అవలంబించి, నీవు కేవలం నీ మనశ్శరీరాలకు మాత్రమే పరిమితం గాకుండా ఉండటం అంటే, నీ మనశ్శరీరాలను అసలు పట్టించుకోవు అని అర్థం కాదు. నీవు అన్నం తింటూనే ఉంటావు, జీవిస్తూనే ఉంటావు, అన్ని పనులూ చేస్తూనే ఉంటావు, వాస్తవం చెప్పాలంటే, నీవు నీ మనశ్శరీరాలపట్ల పూర్వంకంటే ఎక్కువ శ్రద్ధ చూపిస్తావు. వానిపట్ల జాగ్రత్త వహిస్తావు - వాటికి బద్ధుడవు కాని మాట నిజమే. అయితే అవి పూర్వంలాగా నీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరించే జైలుగోడలుగా ఉండవు. నీ శక్తి సామర్థ్యాలను అన్నింటినీ అణచివేసి, వాటిపై కోపాన్నీ, ద్వేషాన్నీ పెంచుకొని తిరస్కరించటం ఉండదు. నీ ఆత్మాభివ్యక్తికి, నీ మనశ్శరీరాలు ద్వారాలుగా ఉంటాయి.

పైన చెప్పినట్లు, సాక్షిగా ఉన్నవాడు తన మనశ్శరీరాలను తన చైతన్య పరిధిలో గోచరించే విషయాలుగా చూస్తాడు. ఇంట్లోని టేబిలు, ఇంటిముందున్న చెట్లు, వీధిలో పోయే కుక్క, రోడ్డుమీద పోయే టాక్సీ - వీని అన్నింటినీ ఎలా చూస్తాడో అలాగే అతడు తన మనశ్శరీరాలను చూస్తాడు అన్నమాట. ఇలా చెప్పగానే మన చుట్టూ కనిపించే అనేక దృశ్యాలపట్ల మనలో కలిగే జుగుప్సాభావం నీ మనశ్శరీరాలపట్ల కూడా ఉంటుందని కాదు. ఇందుకు భిన్నంగా ఉంటుంది. మన చుట్టూ కనిపించే దృశ్యజాతాన్ని నీవు లోగడవలెకాక, అవి అన్నీ నీ ఆత్మలోని భాగాలే, నీలోనివే, నీవే అని గ్రహించి,

వానిపట్ల ఆ విధంగానే వ్యవహరిస్తావు. నీ మనశ్శరీరాల సంగతి కూడా అంతే. ఈ దృష్టి ఉంటే, జగత్తు అంతా నీ శరీరమే అవుతుంది. జగత్తును ఆ విధంగానే చూడాలి. దాని ఎడల ఆ విధంగానే వ్యవహరించాలి. అంతానేనే అయినపుడు, అందులోని అవిభాజ్యమయిన భాగాలుగా ఉన్న నా మనశ్శరీరాలు కూడా నేనే. ఈ స్ఫురణ కలిగినపుడు నీలోనుండి ప్రేమ ఉప్పొంగుతుంది. విశ్వ ప్రేమ కారణంగా సర్వభూత హితము అలవడుతుంది. అవ్యాజమయిన కరుణాభావనతో హృదయం నిండిపోతుంది. మన ఋషులు, జ్ఞానులు చేసిన బోధలలోని మర్మం ఇదే. ఇప్పుడు నీవు ఇతరులను ఎందుకు ప్రేమిస్తావు? వాళ్ళు నిన్ను ప్రేమిస్తున్నారు కనుక నీవు వారిని ప్రేమించవు. వారు నిన్ను గౌరవిస్తున్నారు కనుక, నీ అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నారు కనుక, లేదా నీ భ్రాంతిలో నీవు కొనసాగటానికి సహకరిస్తున్నారు కనుక, నీవు వారిని ప్రేమించవు. వాళ్ళు అందరూ నీకంటె వేరు కాదు, అందరూ నీవే, "అంతా నేనే", కనుక ప్రేమిస్తావు. ఇది ఆత్మ ప్రేమ. అసలు ప్రేమయే ఆత్మ. "నీవు నిన్ను ప్రేమించుకున్నట్లే పొరుగువాణ్ని ప్రేమించు" కాదు. వాళ్ళు అందరూ నీవే కనుక నీవు వాళ్లను ప్రేమిస్తావు. నీ పొరుగువాణ్నే కాదు, నీ చుట్టూ వున్న జగత్తు నంతా. నీ చుట్టూ ఉన్న పరిస్థితులను నీవు చక్కదిద్దటానికి అప్పుడు ప్రయత్నిస్తావు, నీ కాళ్లనూ చేతులనూ ఎలా చూసుకుంటావో అలా చూసుకుంటావు. ఈ స్థితిలో నీకు నీ మనశ్శరీరాలతో ఎలాంటి సంబంధం ఉందో, అలాంటి సంబంధమే నీ చుట్టూ జగద్దృశ్యాలపట్ల కూడా వుంటుంది.

4

అంతా తానే అనే దృష్టి ఏర్పడినప్పుడు, తన మనశ్శరీరాలకు మాత్రమే తాను పరిమితుడు కాదనే అవగాహన కలిగినపుడు, అంతటా ఒకే ఆత్మ ఉన్నదనీ, ఆ ఆత్మయే ఇన్ని రూపాలుగా లోకంలో కనిపిస్తున్నదనీ స్ఫురణకు వస్తుంది. నిజానికి ప్రతివ్యక్తికీ తన మనశ్శరీరాల కతీతంగా “నేను” అనే తత్త్వం ఉన్నదని అంతరాంతరాలలో స్ఫురణ ఉంటుంది. ఆ నేను అనే తత్త్వం సకల జీవరాశిలో ఒకటే అని తెలిసి ఉంటుంది. ఒకవ్యక్తి ఇంట్లో ఒక గదిలోనుండి ఇంకో గదిలోకి నడచి వచ్చినా 'నేను' అనే తన అస్తిత్వంలో ఎట్టి మార్పు రాని విధంగానే, అతడు తన శరీరంలో వున్నట్లుగానే ఇంకో శరీరంలోకి మారినా 'నేను' అనే అతని అస్తిత్వం ఎట్టి మార్పు లేకుండా అలాగే ఉంటుంది. ఆ శరీరంలో వుండగా దానికి సంబంధించిన గతస్మృతులు, భిన్నమయిన సంస్కారాలు, భావనలు అన్నీ వేరై ఉన్నా, 'నేను' అనే ఉనికి అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంటుంది. తన మనశ్శరీరాలే కాదు, సమస్తమయిన మనశ్శరీరాలకూ సకల దృశ్యాలకూ తాను సాక్షి. తాను వానికి కట్టుబడి లేడు.

5

మన మనశ్శరీరాలకు అతీతంగా మన అస్తిత్వం నిలిచి వుంది అనీ, అన్నింటికీ 'నేను' అనే తత్త్వం సాక్షి అనీ ఈ అంతర్దృష్టి ఏర్పడినప్పుడు మనకు జనన మరణాలు అనేవి లేవు అనే జ్ఞానం కూడా సహజంగా కలుగుతుంది. మనకు అమరత్వ భావన సిద్ధిస్తుంది. అసలు నిజానికి ప్రతివాడికీ ఈ జ్ఞానం ఉంది అంతర్గతంగా. ఎవ్వడూ తాను లేని స్థితి ఊహించుకో లేడు. ఇది ఎవరివల్లా కాదు. మామూలు మనిషి దేహాత్మభావనలోనే ఉంటాడు. అలా ఉన్నా తాను చిరకాలం జీవించి ఉండాలని కోరుకుంటాడు. అహంకార మమకారాలతో కూడిన జీవ భావన అలాగే అనంతంగా కొనసాగాలని అనుకుంటాడు. మనశ్శరీరాలు నిత్యములు కాదు. అవి మిగతా అన్ని వస్తువుల లాగానే నశిస్తాయి. అవి ఇపుడు కూడా శిథిల మవుతూనే వున్నాయి. చిరకాలం అవి ఉండేవి కావు. పునర్జన్మ సిద్ధాంతంలో కూడా చెప్పబడిన విషయం ఏమిటి? ఈ మనశ్శరీరాలు మరల పుడతాయని కాదు. వీనికి అతీతంగా వున్న జీవుడే ఇంకో శరీరాన్ని ధరిస్తాడు. మన శాస్త్రాలలో చెప్పిన విషయం ఇదే.

మన మిథ్యాహంతనుండి మనం విడివడాలి. అహంతగా మనం మరణించాలి. జీవ భావనను వదలివేయాలి. మరణ స్పర్శలేని సత్యాత్మగా మేల్కొనాలి. అనగా “నీవు మరణించక ముందే మరణిస్తే, నీవు మరణించినపుడు మరణించవు." (If you die before you die, then when you die, you won't die) అంటే మరణ భయం మాయమ వుతుంది

6

దీన్ని మనం ఇంకో రకంగా కూడా అర్థం చేసుకోవచ్చు. మన పూర్వులయిన ఋషులు, మునులు, జ్ఞానులు చెప్పిన సత్యము ఒకటి ఉంది. అందరిలోను ఒకే ఒక ఆత్మ సమానంగా నిలిచి వ్యాపించి ఉంది. అది సత్యాత్మ, నిత్యాత్మ. నీకు

ఇది అనుభవంలో ఉన్న విషయమే. నీవు నిన్న ఏ వ్యక్తివైతే అయి ఉన్నావో, ఆ వ్యక్తిగానే ఇవాళ కూడా ఉన్నావు. అలాగే ఒక ఏడాది క్రిందట ఏ వ్యక్తివైతే నీవు అయి ఉన్నావో అదే వ్యక్తిగా ఇప్పుడు కూడా ఉన్నావు. అంతే కాదు. నీ ఊహకు అందిన మేరకు లోగడ నీవు ఏ వ్యక్తివైతే అయి ఉన్నావో ఆ వ్యక్తిగానే ఇప్పుడు కూడా ఉన్నావు. నీవు లేని సమయాన్ని నీవు గుర్తించలేవు. నీలో యేదో ఒక తత్త్వము కాలగతి చేత స్పృశింపబడనిదిగా ఉంది. అయితే ఇప్పటి నీ శరీరం ఏడాది క్రిందట నీకున్న శరీరం కాదు. నీ తలపులు, నీ ఉద్వేగాలు అన్నీ గతంలో ఉన్నట్లుగా ఇప్పుడు లేవు. ఇపుడున్నట్లుగా గతంలో లేవు. అలాగే నీకు ఎన్నో స్మృతులున్నాయి. గతాన్ని గురించిన స్మృతులే అవి. అయినా ఒక దశాబ్దం క్రిందట నీకున్న స్మృతులు వేఱు. అవి ఇప్పుడు లేవు. నీ మనస్సు, నీ శరీరం, నీ భావాలు అన్నీ కాలక్రమంలో మారాయి. కాని ఒకానొక తత్త్వం మారకుండా అలాగే ఉంది. అది మారలేదని కూడా నీకు తెలుసు. గతంలో ఏదయితే ఉన్నదో అది ఇప్పుడు కూడా అదే రీతిలో ఉన్నది అని నీకు తెలుస్తున్నది.

7

గత ఏడాది ఇదే సమయంలో నీకున్న బాధ్యతలు వేఱు. బాధలు వేఱు. నీకు అప్పుడున్న సమస్యలు ఇప్పటి సమస్యలకంటే పూర్తిగా భిన్నమయినట్టివి. ఇప్పటి నీ అనుభవాలు వేఱు. అప్పటి నీ అనుభవాలు వేఱు. ఇప్పటి నీ తలపులు వేఱు. అప్పుడు నీకున్న తలపులు వేఱు. గతంలో ఉన్నవన్నీ మాయమై పోయాయి. కాని గతంలో వున్న తత్త్వమే నీలో ఇప్పుడూ నిలిచి ఉంది. ఇంకో విధంగా దీన్ని వివరించవచ్చు. నీవు మరో దేశానికి వెళ్లావు. అక్కడ నీకు కొత్త మిత్రులు ఏర్పడతారు. చుట్టూ ఉన్న పరిస్థితులు కొత్తగా ఉంటాయి. అనుభవాలు క్రొత్తగా ఉంటాయి. తలపులు క్రొత్తగా ఉంటాయి. అయినా నీవు ఆ పాత 'నేను'గానే ఉంటావు. నీ జీవితంలో నీ మొదటి పది ఏండ్ల కాలము లేదా ఇరువది ఏండ్ల కాలము నీకు గుర్తు లేదనుకో. ఏమయింది? నీవు నీవుగానే ఉంటావు. నీలోని ఆ 'నేను' తత్త్వము చెక్కు చెదరకుండా అలాగే ఉంది. పోనీ, ఈ క్షణములో నీవు గతాన్ని అంతటినీ మర్చిపోయావనుకుందాము. నీవు అదే నేనుగా ఉంటావు. ఏదయినా నీ 'నేను'లో మార్పు వచ్చిందా?

క్లుప్తంగా చెప్పాలంటే - నీలో ఏదో ఒక తత్త్వం ఉంది. నీలోపలి లోతులలో, అంతరంగంలోని అగాధాల్లో 'నేను' తత్త్వము ఒకటి ఉంది. అది స్మృతి కాదు, తలపు కాదు, మనస్సు కాదు, శరీరము కాదు, వానికి సంబంధించిన అనుభవాలు కాదు, నీ పరిస్థితులు కాదు, నీ భావనలు కాదు, నీ సంఘర్షణలు కాదు - ఇవన్నీ మార్పుకు లోనవుతూనే ఉన్నాయి. ఇవన్నీ మార్పు చెందినా, నీలోని ఆ 'నేను' తత్త్వం ఏమార్పూ లేకుండా అలాగే స్థిరంగా ఉంది. కాలవేగం ఆ తత్త్వాన్ని తాకలేదు. ఆ తత్త్వమే సాక్షి చైతన్యము, అదే ఆత్మ చైతన్యము కూడా.

8

జీవరాశి అంతటిలో ఒకే రీతిగా వ్యాపించి వున్న ఆ 'నేను' తత్త్వమును సాక్షాత్కరించుకోవటం అసంభవమయిన విషయమేమీ కాదు. మన చుట్టూ కనిపించే 'నేను'లు అన్నీ కలిపి ఒకటే 'నేను'. ఇన్ని 'నేను'లు ఎలా వుంటాయి? ఒకే 'నేను' తత్త్వము లేక ఆత్మ వివిధములయిన శరీరాలను ధరిస్తోంది, వివిధములయిన స్మృతులను కలిగి ఉంటోంది, వివిధములయిన తలపులను కలిగి ఉంటోంది. ప్రతివాడూ 'నేను' అనే అంటాడు కనుక, ఆ 'నేను' అంతటా ఉన్నదనే సత్యం అనుభవానికి తెచ్చుకోవచ్చును.

ఈ తత్త్వం ఇప్పుడు ఈ క్షణంలోనే కాదు, అన్ని కాలాలలోనూ ఉంది. గతకాలంలో ఉంది, భవిష్యత్తులో ఉంటుంది. అంటే ఈ శరీరం పుట్టినప్పుడు ఉంది. అన్ని శరీరాలూ పుట్టినపుడు ఉంది- అవి పుట్టక ముందు ఉంది. అనాదిగా ఉంది. అనంతంగా ఉంటుంది. ఇలా సర్వదా నిర్వికారంగా కేవలముగా అనగా ఏకమైన తత్త్వముగా, 'నేను' గా, 'నేను నేను'గా అందరిలోనూ, అన్నిటిలోను, అంతటా వెలిగే సాక్షి చైతన్యమును అనుభవ గోచరం చేసుకోవాల్సి ఉంది.

'నేను' ఈ శరీరం పుట్టినపుడు పుట్టలేదు. శరీరం నశిస్తే నశించదు. ఇది కాలమునకు అతీతము. దానికి రంగు లేదు, రుచి లేదు, వాసన లేదు, రూపము లేదు, అంతటా ఒకే రీతిగా వ్యాపించి ఉన్న తత్త్వము ఈ సాక్షి చైతన్యము.

సాక్షి చైతన్య మాత్రుడనైన 'నేను' సూర్యుణ్ని చూస్తాను, చంద్రుణ్ని చూస్తాను, మేఘాలను చూస్తాను, కాని నన్ను నేను చూడలేను. 'నేను' పక్షుల కలకలాన్ని వింటాను, చుట్టూ ఉన్న అన్ని రకాల శబ్దాలను వింటాను, కాని 'నేను' నన్ను వినలేను. నేను చెట్టుకొమ్మను పట్టుకోగలను, ఆకుల్ని పట్టుకోగలను, ఇతర వస్తువులలో దేన్ని అయినా పట్టుకోగలను, కాని నన్ను నేను పట్టుకోలేను. ఈ 'నేను' తత్త్వమును నేను చూచేందుకు ప్రయత్నం చేయవలసిన అవసరం లేదు. అది ఏ విధంగానూ సాధ్యం కాని విషయం. కన్ను కంటిని చూస్తుందా? వ్రేలు వ్రేలిని తాకుతుందా? కత్తి కత్తిని కోసుకుంటుందా? నీరు నీటిని తడుపుతుందా? నిప్పు నిప్పును కాలుస్తుందా? నీవు చేయగలిగినదల్లా ఒకటే. నీవు నీ గత స్మృతులతో గల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. నీ మనస్సుతో గల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. నీ శరీరంతో గల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. నీ తలపులతో గల తాదాత్మ్యాన్ని వదలుకోవాలి. ఇలా వదలుకోవడానికి బ్రహ్మాండమయిన ప్రయత్నం ఏమీ చేయనక్కరలేదు. లేదా దీన్ని అర్థం చేసుకొనేందుకు తలక్రిందులుగా తపస్సు చేయనక్కర లేదు. కావలసిందల్లా సరియైన అవగాహన ఒక్కటే. నీవు చూచేదంతా, అనగా నీకు దృశ్యముగా ఉన్నదంతా నీవు కాదు. దృశ్యము ద్రష్ట కాదు. నిన్ను గురించి నీకు తెలిసిన దంతా నీవు కాదు. జ్ఞేయము జ్ఞాత కాదు. మరేమిటంటే అది అంతరమున ఉండే 'నేను'. అది చూడలేనిది, నిర్వచింపబడలేనిది, నీకు దృశ్యముగా చేసుకొన వీలు లేనిది. బంధము అంటే ద్రష్టను దృశ్యములుగా ఉన్న వస్తువులుగా భ్రాంతి చెందటమే. ఈ తప్పిదాన్ని సరిదిద్దుకోవటంతో ముక్తికి దారి ఏర్పడుతుంది.

నీ వెప్పుడైనా ఏదయినా సమస్యలతో సతమత మవుతున్నపుడు, దేనివల్లనైనా మనస్సు సంక్షోభానికి గురి అయినప్పుడు, దేహానికి సంబంధించినవి, మనస్సుకు సంబంధించినవి అయిన ఏ విషయాలవల్ల నైనా కలతకు లోనయినపుడు, నీవు బంధంలో చిక్కుకుంటున్నావు, పరిమితికి లోనవుతున్నావు. భయభ్రాంతుడ వవుతున్నావు, చివరకు మరణానికి గురి అవుతున్నావు. ఇవన్నీ నీవు చూడగల్గేవి. అవి చూచే నీవు కావు. నీవు నిరంతరం ద్రష్టగా, సాక్షిగా, ఆత్మగా నెలకొని ఉంటే, అలా పరిమితుల నుండి, సమస్యలనుండి నీవు వైదొలగితే, వాటినుండి విడివడినవాడవవుతావు.

సాక్షి భావన యొక్క ఈ అభ్యాసము సరళమైనట్టిది, సూటి అయినట్టిది, అభ్యాసాతిశయముచేత అనుభవగోచరము కావించుకోవలసినట్టిది. దీని ద్వారా ఈ జీవితంలోనే నీకు ముక్తి కరతలామలక మవుతుంది. సాక్షి చైతన్యము అంతటా వుంది. అది ఆత్మచైతన్యమునకు అభిన్నముగానే వుంది. నీవు దానిని ఏ విధంగా భావించినా సత్యమయిన మాట ఇదే. చివరగా చెప్పవలసిన మాట ఒకటి ఉంది. ఆత్మ చైతన్యమే నీ కనులద్వారా చూస్తోంది, నీ చెవులద్వారా వింటోంది, నీ నోటిద్వారా మాట్లాడుతోంది. అందుచేతనే తన్ను తాను తెలుసుకోవటమే దైవాన్ని తెలుసుకోవటం.

# ఇప్పుడే ఇక్కడే ముక్తులం మనం

జ్ఞాన స్థితి లేదా ముక్త స్థితి అనేది కాలాతీతమైన స్థితి. అంటే అది పూర్తిగా ఇప్పుడే ఇక్కడే ఉన్న స్థితి.

ఇప్పటికే సిద్ధంగా ఉన్న దానిని చేరుకునేందుకు ఏ దారి ఉంటుంది? భగవాన్ శ్రీ రమణ మహర్షి చెప్పినట్లు ముక్తికి దారి ఏదీ లేదు. ఇదే అంతిమ సత్యము.

ఇది మనకు విడ్డూరంగా కన్పిస్తుంది. అసమంజసమయిన మాటగా తోస్తుంది. సమ్మతింప తగనిదని అనిపిస్తుంది. దీనికి కారణం ఉంది. మనం ఇప్పటిదాకా ఎన్నో సాధనలు చేసి ఉన్నాము. ఇంకా చేస్తున్నాము. తీర్థయాత్రలు చేశాము. పూజలు చేశాము. జపాలు చేశాము. ధ్యానాలు చేశాము. సత్సంగములు నిర్వహించాము. సమావేశాలు పెట్టాము. సేవా కార్యక్రమాలలో పాలుపంచుకున్నాము. ముఖ్యంగా ఎన్నో పుస్తకాలు చదివాము. చర్చలు చేశాము. పుస్తకాలు వ్రాసి ప్రచురించాము. వాటిని పంచాము. ప్రసంగాలు చేశాము. భగవాన్ బోధించిన ఆత్మ విచార మార్గమును, శరణాగతి

తత్త్వమును తెలుసుకున్నాము. అభ్యసించాము. ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నించాము. ఇప్పుడు కూడా అదే పనిలో ఉన్నాము. అన్నీ ఇంకా అలాగే వున్నాయి. ఈ స్థితిలో ఇప్పుడు చెప్పిన పై మాట చెవికెక్కేదిగా ఉంటుందా? కాని, సత్యము మాత్రము అదే. ముక్తి లేదా జ్ఞానము సర్వత్ర సర్వదా సర్వముగా ఉండే తత్త్వము. తనలో సమస్తాన్ని ఇముడ్చుకున్న తత్త్వము అది. ఉదాహరణకు అద్దం వుంది. తనలోని ప్రతిబింబము లన్నింటినీ కలుపుకొని, తనలో ఇముడ్చుకుని ఉండే వస్తువు అద్దం. ముక్తి అంటే అది తతిమ్మా అవస్థలకు అనగా జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు భిన్నంగా, వానికంటె వేఱుగా ప్రత్యేకంగా ఉండే స్థితి కాదు. సర్వావస్థలయొక్క నిజ తత్త్వముగా, వాటి స్వభావముగా అది ఉంది.

ఏ అవస్థకంటే అయినా ఆ ముక్త స్థితి భిన్నమైనదని చెబితే - అంటే ఇప్పుడు ఇక్కడ మనకున్న ఎఱుక కంటే అది భిన్నమయినదని చెబితే, దాని అర్థం ఏమవుతుంది? దానికి ఒక పరిమితి ఉందని చెప్పినట్లు అవుతుంది. ప్రస్తుతం మనకున్న ఎఱుక కంటె వేఱుగా ఉన్న ఏదో అవుతుంది. కాని జ్ఞానమునకు పరిమితులు లేవు. పరిధులు లేవు. అందుచేత దానినుండి దేనినీ విడదీసేందుకు వీలు కాదు. సాక్షాత్కారము అని చెప్పబడేది మెఱుపులాగా స్పష్టంగా ఈ క్షణంలోనే, ఈక్షణంగానే, ఇక్కడ ఇప్పుడున్న ఈ స్థితిగానే అనుభవములోకి వచ్చే స్థితి.

ఒక దృష్టాంతముతో దీనిని వివరించుకోవచ్చు. సముద్రములో ఎన్నో అల లుంటాయి. ప్రతి అల తతిమ్మా అలల కంటే భిన్నమైనదిగానే గోచరిస్తుంది. తప్పకుండా అవి భిన్నమైనవే. కొన్ని అలలు ఒడ్డుకు దగ్గరగా ఉంటాయి. అవి ఎత్తుగా ఉంటాయి. ఎగసి పడుతుంటాయి. ఒడ్డుకు కొట్టుకుంటుంటాయి. మిగతావి అలా కాదు. దూరంగా సముద్రం మధ్యలో ఉంటాయి. బలహీనంగా ఉంటాయి. ఎత్తుగా ఉండవు. ఒకవేళ మనం అలలపై తేలియాడుతూ చిన్న నావలో పోవాలనుకుంటే, ఏదో ఒక అలను ఎన్నుకొని, దానిపైకి పోయి, అలా surfing చేస్తాము, మన సామర్థ్యాన్ని బట్టి. అలలు వేరు వేరుగా లేకపోయినట్లయితే మనం ఈ విధంగా చేయలేము. మన సాధనలు అన్నీ ఇలాంటివే అని చెప్పవచ్చు. ఒక్కొక్కరకమయిన సాధన ఒక్కొక్క అలపైన తేలియాడే ఆట వంటిది.

కాని జ్ఞాన స్థితిని గూర్చి చెప్పినప్పుడు దానిని సముద్రంలోని ఒకానొక అలగా చూడకూడదు. జ్ఞాన స్థితి సముద్రంలోని ఒకానొక అలవంటిది కాదు. అది సముద్రములో నీరు వంటిది. ఆ నీటికి పరిమితి లేదు. తేడా లేదు. నీటికీ, సముద్రములోని అలలకూ అక్కడ తేడా ఏమీ లేదు. అంతా నీరే అయి ఉన్నదని అనుభవంలోకి వచ్చినపుడు ఉండే స్థితి ఇదే.

అనగా, అలలు అన్నింటిలోనూ నీరు సమానంగా వ్యాప్తమై ఉంది. ఏ అలకూడా మరో అలకంటె ఎక్కువగా గాని, తక్కువగా గాని తడిని కలిగి ఉండదు. అన్ని అలలూ తడిగానే ఉంటాయి. అన్ని అలలలోనూ నీరు ఉంది. అసలు అన్ని అలలూ నీరే. నీరు కాక మఱి వేరే ఏమీ కాదు.

అలలకు గాని, నీటికి గాని తేడా ఏమీ లేదు. వాటి మధ్య ఏ భేదమూ లేదు. అంటే, అలలు అన్నింటిలోనూ నీరు సమానంగా ఉంది. ఒక అలలో నీరు ఎక్కువగా ఉండి, ఇంకో అలలో నీరు తక్కువగా లేదు తడి కూడా అంతటా ఒకే రీతిగా ఉంది.

కనుక, నీవు నీటికోసం వెదక దల్చుకుంటే అలలు అన్నింటిలో ఉన్నది అదే కనుక - ఒక అలనుండి ఇంకో అలపైకి ఎగిరి దూకనక్కరలేదు. అలా చేస్తే నీవు ఎంతో కోల్పోయిన వాడవు అవుతావు. ఎందుకంటే నీవు నీటికోసం ఒక అలమీద నుండి ఇంకో అలమీదకు దూకుతూ పోయినంత కాలమూ, నీరు అనేది శుద్ధమయిన రీతిలో, నీవు ఇప్పుడు ఏ అల మీద అయితే ఉన్నావో ఆ అలలోనే ఉన్నదనే సత్యము నీకు సాక్షాత్కరించదు.

ఆత్మను గూర్చి వెతకటం అంటే నీటిని వెతకుతూ ఒక అల మీద నుండి ఇంకో అలమీదకు దూకటం వంటిదే. అందు చేతనే ఆత్మను పొందేందుకు దారి లేదు. అసలు ఆత్మ ప్రాప్తి అనేది కూడా లేదు, అది ప్రాప్తమయ్యే ఉంది కాబట్టి. ఈ క్షణంలో నీ అనుభవం ఏదయినా అది ఆత్మానుభవమే, అనుభవం అనే మాట వాడదల్చుకుంటే.

నీవు ఆత్మను పొందవలసి ఉందని భావిస్తే, ఎలా ఉంటుందో తెలుసా? నీటిలో గొంతులోతుగా నిలబడి, 'దాహం' 'దాహం' అని అరచినట్లుంటుంది. సముద్రంలో ఈదుతూ పోతున్న చేప, సముద్రాన్ని వెతకుతున్నట్లు ఉంటుంది. సరిగా చెప్పాలంటే సముద్రమే స్వయంగా సముద్రంకోసం వెతకుతున్నట్లు ఉంటుంది.

మళ్లీ మొదటికి వచ్చి చెబితే, ఆత్మను పొందే దారిలేదు. అలాంటి దారి ఏదీ లేదు కనుక. ఆత్మానుభవము అంటే మన వివిధ అవస్థలలోని అనుభవాలలో ఒకానొక అనుభవం కాదు. లేదా ఆ అనుభవాలకంటె విలక్షణమైన, గొప్పదయిన మరొక అనుభవం కాదు. నీటిని చూచేందుకు ఒక అలను కాదని ఇంకో అలను వెదకితే ఎలా ఉంటుంది? ఆత్మానుభవం అనేది - అనుభవం అనే మాట వాడదల్చుకుంటే- మనం ఇప్పుడు ఇక్కడ ఏ అలమీద ఉన్నామో ఆ అలయొక్క అనుభవమే. ఇప్పుడు ఉన్న అనుభవం తప్ప మరొకటి ఏదీ కాదు, ఏదీ లేదు. ఎప్పుడూ ఉన్న ఆ స్థితిని చేరే దారి పేరే ఏమీ లేదు. ఇప్పటికే నీవు గొంతు లోతు నీటిలో నిల్చి ఉండగా, నీటిని పొందేందుకు దారి ఏముంటుంది?

మన ఋషులు అందుకే చెప్పారు ఆత్మను పొందలేవు, పొందే ఉన్నావు కనుక. ఆత్మను చేరే దారి లేదు, మనమే ఆత్మ కనుక. ఆత్మ పొందేదీ కాదు, పోగొట్టుకునేదీ కాదు. మనం ఆత్మయే అయి ఉండి, అది ఏదో అన్యమయినదైనట్లుగా పొందలేము. ఆత్మ నీ చెంతనే ఉంది. నీవుగా ఉంది. నీవే అది. దానికోసం నీవు పోయి ఎక్కడో వెతక నక్కర లేదు. సత్యాన్ని అన్వేషించే వాడు ఆ సత్యమును ఎన్నటికీ కనుగొన లేడు.

సారాంశం ఏమిటంటే ఆత్మను చేరేందుకు ఏ దారీ లేదు. ఆత్మ ప్రాప్తికి ఏ ఉపాయాలూ, ఏ సాధనా పద్ధతులూ లేవు. ఆ ఆత్మ సర్వత్ర ఉన్న తత్త్వము. సర్వదా ఉన్న తత్త్వము. సర్వమూ అదే. అది ఇప్పుడే ఇక్కడే వుంది. నీటికోసం ఒక వ్యక్తి ఒక అలమీద నుండి ఇంకో అలమీదికి దూకినట్లుగా ఉంటుంది, సాధనల పేరిట మనం పడే కష్టం అంతా. మనం ఎప్పుడూ ఎటో చూస్తున్నాము. జవాబు ఇక్కడే ఉంది, కాని మనం ఆ జవాబు నుండి పైదొలగిపోతున్నాము, దానిని కాదని వదలి పెడుతున్నాము. మనం ఎప్పుడూ ప్రక్కకు, ఇంకో పైపుకు, అంటే అవతలికి చూస్తున్నాము. ఇలా చేసినంతసేపూ మనకు నిత్యసిద్ధమై ఉన్న ఆత్మ, ఈ క్షణంలో మన అనుభవంలో ఉన్న ఆత్మ అనుభవ గోచరం కాదు. ఆత్మాన్వేషణ అలాగే ఆత్మప్రాప్తికై మనలో ఉన్న కోరిక, ఇవే ఆత్మ సాక్షాత్కారానికి అడ్డు గోడలవుతాయి. మనం ఎప్పుడూ నిత్యసిద్ధమై ఉన్న ఈ ప్రస్తుత క్షణంలోని మన అనుభవం నుండి పైదొలగి పోతున్నాము. నిజానికి ఇప్పటి మన అనుభవంలోనే, వర్తమాన క్షణంలోని మన స్థితిలోనే, మన అన్వేషణకు పరిష్కారం దాగి వుంది. కనుక ఏం చెప్పాలంటే మనం మన లక్ష్యం కోసం వెతకటం లేదు. మనం మన లక్ష్యము నుండి పారిపోతున్నాము.

2

అయితే మనం ఏమీ చేయకూడదు అని దీని అర్థమా? వర్తమాన క్షణం నుండి మనం పైదొలగి పోకుండా ఆగి పోవాలా? అది సబబైన విషయమే అనిపిస్తుంది. కాస్త లోతుగా పరిశీలించి చూచేదాకా ఇదే నిజమనిపిస్తుంది. కాని ఏమీ చేయకుండా ఉండడం కూడా సరియైన మాట కాదు. అసలు ఏమీ చేయకుండా ఉండాలనికోరుకోవటం ఎందుకు మనం? ఇది మరల మనం ఇప్పుడు ఉన్న స్థితినుండి పైదొలగిపోవటం కాదా, మనం ప్రస్తుతం ఉ న్న అలమీద నుండి మారి నీటిని వెతుక్కుంటూ ఇంకో అలమీద దూకడం కాదా? మనం ఏది చేయాలని ప్రయత్నించినా లేదా ఏమీ చేయకుండా ఉండాలని ప్రయత్నించినా అది మనం ఇప్పుడున్న స్థితి నుండి మారటమే అవుతుంది. అందుచేత మనం వేసే మొదటి అడుగే తప్పటడుగు అవుతుంది, ప్రధానాంశాన్ని అర్థం చేసుకోకపోవడమే అవుతుంది. ఆత్మాన్వేషణలోని విచిత్రమయిన అంశం ఇది. ఆత్మను పొందేందుకు మనం ఏమీ చేయలేము. ఇంకా స్పష్టమయ్యే విషయం ఏమిటంటే - మనం ఏమీ చేయకుండా ఊరుకుంటే మనం ఎలా వున్న వాళ్లం అలాగే ఉండిపోతాం. సాధన చేసేందుకు ఏమీ లేదు. సాధన అంటూ ఏదైనా చేస్తే, ఆ సాధనా సమాప్తితో ఆత్మకూడా లేకుండా పోతుంది కదా! అయితే ఆత్మకై ఏ సాధన చేయకపోతే మనం అజ్ఞానులంగానే మిగిలిపోతామేమో! ఆత్మాన్వేషణ పథంలో ఇది ఒక ముఖ్యమయిన ఘట్టం. ఆత్మప్రాప్తికోసం మనకు ఒక ప్రత్యేకమయిన మనఃస్థితి ఉండాలి. అయితే ఆ మనఃస్థితివల్ల మనం ఆత్మను చేరుకోము. ఆత్మానుభవము యొక్క అభివ్యక్తియే ఆ స్థితి. ఆత్మానంద స్వరూపమే అది. ఆత్మ సాక్షాత్కారమే ఒక అద్భుతమైన సాధన అందుకే.

ఆత్మానుభవం అదియేదో భవిష్యత్తులో లభించే స్థితి అనీ, యేవో సాధనల పర్యవసానంగా ప్రాప్తమయే స్థితి అనీ భావించటానికి వీలులేదు. అలా భావిస్తే ఆత్మప్రాప్తి ఒకానొక కాలంలో ఆరంభమవుతుందనీ, అది ఇప్పుడు అనుభవంలో లేదనీ, రేపు అంటే ముందెప్పుడో లభిస్తుందనీ భావించినట్లు అవుతుంది. ఇందువల్ల ఆత్మకు ఒక మొదలు ఉన్నట్లూ, కాలపరిధికి అది లోనై ఉన్నట్లూ అవుతుంది. ఇది ఆమోదయోగ్యమయిన మాట కానే కాదు. ఆత్మ ఎల్లప్పుడూ ఉన్న వస్తువు. అది ఇప్పుడే ఇక్కడే సిద్ధంగా ఉన్న తత్త్వము. ఆత్మ ఎప్పుడూ ఉన్నదే అనే జ్ఞానమే ఆత్మ జ్ఞానము. అది ఏనాడో ఎక్కడో సంభవించేది కాదు. అది ఈ క్షణంలో 'ఇప్పుడు' కు ఆధారంగాను, అధిష్ఠానంగాను ఉంది. ఈ క్షణంలోనే దాని మూలము ఉంది అన్నా తప్పు లేదు. అనగా ఈ క్షణంలోని అనుభవానికి అది మూలము. ఆత్మకు అదే మూలము, అదే మొదలు. ఆధ్యాత్మిక సాధన ఈ మూలముయొక్క వ్యాపారము. ఆత్మ జ్ఞానముయొక్క అభివ్యక్తి అది.

కాబట్టి నిజమయిన ఆధ్యాత్మిక సాధన ఆత్మ జ్ఞానం వలన అభివ్యక్తమవుతుంది, ఆత్మ జ్ఞానము కొరకు ప్రారంభం కాదు. మన సాధన జ్ఞానమునకు దారి తీయదు, మన సాధనయే జ్ఞాన స్థితి, ఆదినుండి, ఆద్యంతములు లేని కాలాతీత స్థితి నుండి.

మన సాధన ఆత్మ లాభానికి ఒక ఉపాయము అని అంటే, ఆ మాట కుదరదు, ఆత్మను పొందే దారి లేదు కాబట్టి. జ్ఞాన స్థితి అనేది ఏదో ఒకానొక మనఃస్థితి కాదు, ఏదో ఒక పవిత్ర భావన కాదు. సాధనకు పూనుకున్నపుడు ఏ మనఃస్థితి మనకున్నదో అదే జ్ఞాన స్థితి. దానిని గురించి చెప్పే అవసరం లేదు. అది మనకు ఇప్పటికే ఉన్న స్థితి.

నీవు దైవాన్ని చేరుకోవటానికి ప్రార్థిస్తున్నావు అనే మాట సత్యము కాదు. దైవమే తనకు తాను ప్రార్థన చేసుకుంటున్నాడు అని చెప్పాలి. అసలు ఇంతకు ముందే అది నీవు పొంది ఉన్న వస్తువు కాకపోతే నీవు దానిని అన్వేషించవు. ఇలా ఏ విధంగా చూచినా, మనం చేసే ఆధ్యాత్మిక సాధన ఇప్పటికే మనం చేరి వున్న లక్ష్యమై ఉన్నది. సాధ్యము, సాధన, మార్గము, లక్ష్యము, మొదలు, తుద - అన్నీ ఒకటే.

3

ఇప్పుడు మరో ప్రశ్న ఎదురౌతుంది. మనకు యిప్పటికే లభించి ఉన్న దానికోసం సాధన చేయడం ఎందుకు, అది జ్ఞానమో, ఈశ్వరుడో, అంతరాత్మో, మరేదైనా గానీ?

దీనికి సమాధానంగా ఎదురు ప్రశ్న వేయవచ్చు, "ఎందుకు చేయకూడదు?"

అయితే, ఇది అసలు విషయం కాదు. సత్యమయిన విషయం ఏమిటంటే- జ్ఞానప్రాప్తికై మనం చేసే సాధన, జ్ఞాన స్థితియొక్క సరియైన అభివ్యక్తి. ఎందుకు ఇలా చెప్పాలీ అంటే, జ్ఞాన స్థితిలో ఉన్నవాడు మరి ఇంకా ఏం చేస్తాడు? ఏం చేయాలి? ఆత్మ జ్ఞానము సర్వాంగీణమయిన ఆధ్యాత్మిక వ్యాపారమే, ఆత్మ వ్యాపారమే. మనం ఆధ్యాత్మిక సాధన చేస్తున్నామని అనుకుంటాము. ఆత్మను పొందేందుకు ప్రయత్నిస్తున్నాము అని అనుకుంటాము. కాని, అది ఆత్మసాధన కాదు, అది ఆత్మాభివ్యక్తి. సాధనద్వారా మనం ఆత్మను వ్యక్తమొనరిస్తున్నాము, ఆత్మగా అయ్యేందుకు కాదు. ఆత్మగా వ్యవహరించేందుకు మనం సాధన చేస్తున్నామని అంతరాంతరాలలో మనకు ఉంటుంది, ఎందుకంటే మనం ఆత్మయే అయి ఉన్నాము కాబట్టి.

మనం సాధన మొదలుపెట్టామంటే, ఆత్మ సిద్ధమై ఉంది అక్కడ ఏ తయారీ లేకుండానే. సాధన చేసినా, చేయక పోయినా మనం ఆత్మగానే ఉన్నాము. మనం ఆత్మగా ఉన్నాము కనుకనే మన సాధనలో ఆత్మ ఉంది. మనం మొదట ఆత్మగానే ఉంటే, సాధన చేయడం ఎందుకు అంటే మనం ఆత్మగా ఉండాలి కనుక, ఉంటాము కనుక, ఆత్మగా ఉన్నాము కనుక. ఇంకొక కారణ మేముంటుంది? మనం విచారణకో, ధ్యానానికో, పూజలు చేసేందుకో కూర్చోవటం దేన్నో పొందడం కోసం కాదు, పొంది ఉన్న దాన్ని పొంది ఉన్న దానిగా అభివ్యక్తమొనరించటం కోసం. సాధన చేయడం, సిద్ధమై ఉన్నదాన్ని సిద్ధమై ఉన్నదానిగా ఉంచుకోవడం కోసం. నిజమయిన సాధన అంటే ఇదే. మనిషికి ఇంతకంటే చేయవలసిన సాధన మరొకటి ఏముంది? ఈ రకమయిన జీవితం తప్ప మరొక రకమయిన జీవితం ఏముంటుంది? అతడు భౌతిక విషయ

లంపటుడుగా ఎందుకు ఉంటాడు? ఆత్మసాధనా మార్గంలోనే ఉంటాడు, ఆత్మ సిద్ధమయ్యే ఉన్నదని తెలిపేందుకు లేదా తెలుసుకునేందుకు. ఉన్నవాడు ఉన్నట్లు ఉండటం అంటే ఇదే. ఊరక ఉండటానికి సరియైన నిర్వచనం ఇదే. అంతేగాని మొద్దులాగా, అయిలాగా పడి ఉండటం కాదు. అక్షరమణ మాలలో ఒక పద్యంలో భగవాన్ చెప్పిన మాట ఇది.

ఇది ఆత్మ స్థితిలో ఆనందమయముగా ప్రతిక్షణము ఉండే జ్ఞానాభివ్యక్తి. అనేక మార్గాలు ఇతరములైనవి ఉండవచ్చు. కాని జ్ఞాన మార్గంలో ప్రయాణించే ఆత్మజ్ఞుల జీవనం ఇదే రీతిలో ఉంటుంది. సరిగా అర్థం చేసుకుంటే, ఆధ్యాత్మిక సాధనల పేరిట చేసే వివిధ పద్ధతులే కాదు, మనం చేసే ప్రతి పనీ సాధనే అవుతుంది. అదే ఆత్మాభివ్యక్తి అవుతుంది. "యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం". మనం చేసే ప్రతి పనీ, మనం మాట్లాడే ప్రతి మాటా, మన మనస్సులో మెదలే ప్రతి తలపూ- ఇవి అన్నీ అనంతత్వమునుండే, ఆత్మనుండే బయలుదేరుతున్నాయనీ, ఆత్మవ్యాపారముగానే ఉన్నాయనీ అనుభూతమవుతుంది. ప్రతిదీ ఉన్నది ఉన్నట్లుగా నిరాటంకంగా పూర్ణముగా సాగే సర్వాత్మభావన యొక్క అభివ్యక్తిగా ఉంటుంది. మనం ఏమి చేస్తే అదే సాధన, మన ప్రార్థన. కేవలం ఆత్మ విచారణ మాత్రమే కాదు, మంత్ర జపం, సంకీర్తన, ధ్యానం, రకరకముల పూజా కార్యక్రమాలు, స్తోత్ర పారాయణలు, గ్రంథ పఠనాలు - అంతెందుకు, మనం కప్పులు కడిగితే అదీ, లేదా ఆదాయపు పన్నుల కాగితాలు తయారు చేస్తే అదీ ఇలా అన్నీ ఆత్మ వ్యాపారములే. ఇలా చెప్పగానే దాని అర్థం, కప్పులు కడుగుతూ అదే ఆత్మ సాధన అనుకుంటామని కాదు. కప్పులు కడగడం కూడా ఆత్మాభివ్యక్తియే అవుతుంది - ఆత్మస్ఫురణ లేకుండా, ఆత్మ ప్రేరణ లేకుండా మనం అడుగు తీసి అడుగు పెట్టలేము కనుక, ఒక్క మాట కూడా మాట్లాడలేము కనుక, ఊపిరి సయితం పీల్చుకోలేము కనుక. ఇది ఒక అద్భుతమయిన అనుభవము.

4

ఇదంతా సరే, బాగుంది. కాని ఈ సందర్భంలో మన దృష్టికి వచ్చే ముఖ్యమయిన అంశం ఒకటి ఉన్నది. అది ఏమిటో తెలుసా? లోకంలో సామాన్యంగా ఆత్మ జ్ఞానమును ఎవరూ కోరుకోవటం లేదు మనం కూడా. నిజానికి ప్రతిక్షణమూ, అన్ని సమయాలలోను సహజంగా ప్రాప్తమై ఉన్న ఆత్మ జ్ఞానాన్ని మనం తిరస్కరిస్తున్నాము. అది అనుభూతము కాకుండా అడ్డుకుంటున్నాము. ఇంతకంటే విచిత్రమయిన విషయము మరొకటి లేకపోయినా, ఇదే నగ్నసత్యము. సర్వానుభవ సిద్ధమయిన, కఠిన మయిన వాస్తవము. మనం ఆత్మనుండి, భగవంతుని నుండి తప్పించుకొని తిరుగుతున్నాము. ఆత్మతో, దైవంతో యుద్ధానికి సిద్ధపడుతున్నాము. మనము ఎప్పుడూ ఒక అలమీద నుంచి ఇంకో అలమీదికి దూకుతూనే ఉన్నాము, నీటికోసం. ఇప్పుడు మనం ఏ అలమీదనైతే ఉన్నామో ఆ అలలోని నీటిని కాదని ప్రక్కకు తొలగిపోతున్నాము. కాని ఆత్మ జ్ఞానమూ, మనం ఇప్పుడున్న ఈ క్షణమూ ఈ రెండూ రెండు కావు. అవి ఒకటే. ఒకదాన్ని కాదని అంటున్నామంటే, రెండోదానిని కాదని అంటున్నట్లే. మనం ఎప్పుడూ భగవత్సాన్నిధిని, ఆత్మ సన్నిధిని కాలదన్నుతున్నాము. కష్టమయిన మాటే ఇది. ఆత్మ సన్నిది ఇప్పుడే ఇక్కడే పూర్ణముగా చుట్టూ సమస్త రూపములుగా సిద్ధమై ఉంది. జీవితంలోని ఏ ఒక పార్శ్వమునైనా మనం ఇష్టపడటం లేదంటే ఆ మేరకు మనం ఆత్మ జ్ఞానాన్ని వ్యతిరేకిస్తున్నా మని అర్థం. అలా మనం క్రియాశీలంగా, రహస్యంగా ఆత్మజ్ఞానాన్ని తిరస్కరిస్తున్నాము, వ్యతిరేకిస్తున్నాము. ఈ రహస్య తిరస్కరణను గురించి మనం తెలుసుకోవటమే ఆత్మ జ్ఞానానుభవానికి అంతిమ ద్వారము.

ఇంకో విషయమేమిటంటే- మనం ఇలా తిరస్కరిస్తున్నట్లు నిజానికి మనకే తెలియదు. తెలియకుండా చేస్తున్నా మీపని. ఆత్మజ్ఞాన తిరస్కరణ అనే విషవలయంలో చిక్కుకున్నామని మనకు అసలు తెలిసే తెలియదు. మనకు వేదం చెబుతోంది 'తత్త్వమసి', 'అది నీవే' అని. గురువులు చెబుతున్నారు. 'నీవు ఆత్మవే' అని. మన అనుభవం చెబుతోంది, “నేను దేహమునా, కాదు; ప్రాణమునా, కాదు; మనస్సునా, కాదు; అజ్ఞానమునా,కాదు; ఆత్మనే," అని. అయినా మనం యీ శాస్త్రవాక్యాలనూ, గురుబోధలనూ, స్వంత అనుభవాలనూ అన్నింటినీ కట్టగట్టి ప్రక్కన బెట్టి, మన జ్ఞాన తిరస్కరణ విద్యను ప్రదర్శిస్తూనే ఉన్నాము. పైకి మనం చెబుతాము- 'నా వశంలో వుంటే నేను దుఃఖపడను, దిగులు పడను, శోకానికి గురి కాను," అని. కాని మనలో ఈ భావం ప్రక్కనే ఇంకొక సగభాగం ఉంది. దానిని మాయ అనండి, ఏమయినా అనండి, అది దుఃఖాన్ని ఆహ్వానిస్తుంది. తన బాధను, తన బంధాన్ని ప్రేమిస్తుంది. తనను తాను గాయపర్చుకుంటుంది - తనకు తెలియకుండా. మనకు తెలియదు, కనుక దానిని మనం ఆపలేము. మనం మన దుఃఖాలను, కష్టాలను కొని

తెచ్చుకుంటున్నాము. కాని ఆ సత్యాన్ని మనం ఒప్పుకోము. చివరకు ఈ కష్టాలు మనకు తప్పవు, అని వాటిని సమర్ధించుకుంటాము. వాటితో సర్దుకొని పోతాము. మనం ముందుకు పోలేము. తిరస్కరిస్తూ తిరస్కరిస్తూ మన ప్రయత్నాలకు మనమే గండి కొట్టుకుంటాము.

ఇదంతా ఎందుకు వచ్చిందంటే, మనం చూచే చెట్లు, నక్షత్రాలు, సూర్యుడు, చంద్రుడు అలాగే మన ఈ శరీరము, ఈ ప్రాణము, ఈ మనస్సు- ఇలా ఇవి అన్నీ మనకంటే వేరయినవనీ, అవి మనకు దృశ్యములనీ అనుకుంటున్నాము. అవి మనకు బయట ఎక్కడో ఉన్నట్లు భ్రమిస్తున్నాము. మన చుట్టూ ఉన్న ఈ జగత్తు యావత్తు అది స్థూల కారణములలో ఏదైనా కావచ్చు - అదంతా మనలో భాగమే అని తెలుసుకొన్నప్పుడు దానిని మనం ప్రేమిస్తాము. అది మనకు భిన్నమని అనుకొన్నపుడు దానిని మనం ఉపేక్షిస్తాము, తిరస్కరిస్తాము. దానితో పోరాడతాము. అంటే ఏకత్వ భావనతో మనం పోరాడుతుంటాము.

మన సాధనలో ముందుకు సాగుతున్నకొద్దీ మనకు ఇది అవగాహన అవుతుంది. మనం సహజంగా మనలో వున్న జ్ఞాన స్థితికి ఎలా ఎదురు నిలిచి పోరాడుతున్నామో తెలుస్తుంది. సాధన వల్ల మనం పొందే లాభం ఒక్కటే, మనలో అంతర్గతంగా రహస్యంగా దాగి వున్న ఈ తిరస్కరణ మన స్ఫురణలోనికి వస్తుంది. దాని ఎఱుక మనకు కలుగుతుంది. మన తిరస్కరణయొక్క అవగాహన మనకు ఏర్పడుతుంది. మన అజ్ఞానం మనకు తెలుస్తుంది. ఇది అవిద్యావేద్యత్వం. "నేను నిజ స్ఫురణము లేని అజ్ఞుడను," అని తెలుస్తుంది. మనకు వాస్తవానికి జ్ఞాన ప్రాప్తి పట్ల ఆసక్తి లేదనీ, ఆత్మ నుండి మనం తప్పుకొని పోతున్నామనీ, దాని నుండి తప్పించుకొని తిరుగుతున్నామనీ తెలుస్తుంది. ఇదే మన సాధనలో ఒక పెద్ద మలుపు.

మన మనస్సులోని లోతుల్లో ఉన్న జ్ఞాన స్థితిని మనం తిరస్కరిస్తున్నాము అని తెలిసిన మరుక్షణం మొట్టమొదటి సారిగా ఆ తిరస్కరణతో తలపడడానికి మనం సంసిద్ధమవుతాము. తలపడి దానిని వదలివేస్తాము, పరిత్యజిస్తాము, ఈ విధంగా మన ముక్త స్థితికి గల రహస్యమయిన అవరోధాన్ని తొలగించుకుంటాము.

5

ఆధ్యాత్మిక సాధనలో మనం అవలంబించే పద్ధతులు - విచారణ కావచ్చు, ధ్యానం కావచ్చు, శరణాగతి కావచ్చు, గురు సేవ కావచ్చు - అవి ఏవయినా కానీ - మన ఆత్మ జ్ఞాన తిరస్కరణ యొక్క స్వరూపము ఏమిటో తెలియపరుస్తాయి! దీన్ని మనం తెలుసుకోవాలి. తెలుసుకుంటే ముక్తి విషయంలో ఏర్పడి ఉన్న విచిత్ర పరిస్థితి అవగతమవుతుంది. మనం జ్ఞానాన్ని కొత్తగా తెలుసుకోము. అది తెలిసే ఉంది. దానికి అడ్డుగా నిలిచి ఉన్న వ్యతిరేకతను తెలుసుకుంటాము. మనము మన లోపల వున్న ఈ వ్యతిరేకతను, ఈ తిరస్కృతిని గమనిస్తాము. అది మన ఎఱుకలోకి రాగానే దానిని విఫలమొనర్చుతాము. దాని మూలం లోకి పోయి అణచివేస్తాము. ఇదే జ్ఞాన ప్రాప్తి. ఆత్మజ్ఞానాన్ని, మనకు సహజసిద్ధంగా ఉన్న ఆత్మ తత్త్వాన్ని ఏ రీతిగా మనం తిరస్కరిస్తూ, వ్యతిరేకిస్తూ వచ్చామో సరిగా గమనించే క్షణం వరకు, జ్ఞానప్రాప్తికై మనం చేసే ప్రయత్నాలన్నీ వ్యర్థమయిపోతూంటాయి. ఎందుకంటే- మనం పొందదల్చుకున్న ఆత్మను మనకుతెలియకుండానే మనం వ్యతిరేకిస్తున్నాము, అడ్డుకుంటున్నాము. ఇలా మనం మన అంతరాంతరాళాల్లో ఆత్మను వ్యతిరేకిస్తున్నాము. అజ్ఞాన రూపంలో మనలను బాధిస్తున్న, మనలను వేధిస్తున్న రోగముయొక్క లక్షణములు బాగా ముదిరిపోయేట్లు చేస్తున్నాము. పైకి మనం ఆత్మ జ్ఞానోపార్జనకై తీవ్రంగా తపన పడుతున్నట్లు ఉంటాము. కాని లోలోపల, మనస్సులోని లోతుల్లో ఆత్మజ్ఞాన వ్యతిరేకతను పెంచుకొని, జ్ఞానప్రాప్తిని అడ్డుకుంటున్నాము, ఆ కోరికను అణచివేస్తున్నాము. ఇదే మనకున్న సమస్య. ఇదే మనకున్న కష్టము. అంటే ఏమిటంటే - మనం ఆత్మజ్ఞానమును పొందేందుకు ముందుకు సాగిపోము. ఆత్మ జ్ఞానము నుండి మనం ఏ విధంగా తప్పుకొని పోతున్నామో అవగతం చేసుకుంటాము. జ్ఞానాన్ని క్రొత్తగా పొందనక్కర లేదు. ఉన్న జ్ఞానానికి అడ్డుగా నిల్చి ఉన్న అజ్ఞానపు పొరలను చీల్చివేయటమే మనం చేయవలసిన పని. అసలు ఈ అవగాహన వల్లనే మనకు ఆత్మ జ్ఞానము యొక్క కించిద్దర్శనమునకు అవకాశము లభిస్తుంది. కారణం ఒకటే. అజ్ఞానాన్ని గురించి మనకు గల అవగాహనయే జ్ఞానము పట్ల మనకు గల వైముఖ్యం నుండి విముక్తి. అజ్ఞాన దర్శనమే జ్ఞాన ప్రాప్తి.

ఆత్మ తిరస్కృతి లేదా అజ్ఞానము లేక మఱపు- అది నీలో జొరబడేది కాదు లేదా లోగడ ఎప్పుడో నీలో చోటుచేసుకొని నిన్ను పీడించేది కాదు, లేదా నీ అనుమతి లేకుండా నీలో అక్రమ ప్రవేశం చేసినట్టిది కాదు. అది నీ ఇప్పటి వ్యవహారము, నీకు తెలియకుండానే నీ ద్వారా సాగే మనో వ్యాపారము. ఇదే జ్ఞానప్రాప్తికి గల అడ్డుగోడ. ఇదే ఈ జగత్తులోని సమస్తాన్నీ, ఇప్పుడు అది ఉన్నట్లు దాన్ని చూచేందుకు మనకు గల అయిష్టం, దాని పట్ల మనకు గల వైముఖ్యం. క్లుప్తంగా చెబితే, ఇప్పుడు ఈ క్షణంలో మనం దానిని చూడము, చూడటం లేదు. బౌద్ధిక అవగాహన ఉండటం వేరు. మనస్సులో స్పష్టత ఉండటం వేరు. వ్యవహారంలో అది అనువదింపబడటం వేరు. మొత్తంమీద ఒకటి మాత్రం స్పష్టం. మనం ఇప్పుడు అనగా ఈ క్షణంలో మన అనుభవంలో గల అసలు తత్త్వమును అంగీకరించటం లేదు.

అంతే కాదు. దానిని మనము వ్యతిరేకిస్తున్నాము, విరోధిస్తున్నాము. ప్రస్తుతం మన స్వభావంలో గల వికృతి ఇది. ప్రస్తుతం ఈ క్షణంలో గల అని చెప్పినప్పుడు అది ప్రస్తుతానుభవంలోని ఒకానొక అంశం కాదు. ఇది నిత్యవర్తమానమునకు సంబంధించిన సకల పార్శ్వములను అని అర్థం. ఇది ఈ క్షణంలో జరిగి అంతమయ్యే దానిపట్ల గల వ్యతిరేకత కాదు, నిత్య వర్తమాన కాలము పట్ల మనలో గల వైముఖ్యం, ప్రాతికూల్యము.

ఈ ప్రాతికూల్యమును మనం స్పష్టంగా చూడలేకపోతున్నాము. దీనిని గురించి ఆలోచించలేకపోతున్నాము. ఇది చాలా సూక్ష్మాంశము. బాహ్యంలో, స్థూల స్థాయిలో మనకున్న ప్రతికూల వైఖరులు మనకు తెలుస్తూనే ఉంటాయి. కాని ఈ వైముఖ్యం సూక్ష్మమయినట్టిది, భ్రమను గొల్పునట్టిది. మనలో చాలామంది దానిని గ్రహించవచ్చు, లోలోపల తెలుసుకోవచ్చు. మొత్తంమీద మనం ప్రస్తుతం ఏ స్థితిలో అయితే ఉన్నామో దానిని పూర్తిగా అంగీకరించే దశలో లేము. మనలో ఎక్కడో ఏదో అల్పాల్పమయిన ఒత్తిడి ఉన్నది. అది మనలను తిన్నగా ఉండనీయదు. మనల్ని, మన ఈ వర్తమానానుభవము నుండి ప్రక్కకు నెట్టివేస్తుంటుంది. అందుచేత మనం ఇప్పుడు ఉన్న స్థితిని అనగా ఉన్నదాన్ని ఉన్నట్లు గ్రహించే ఎఱుకను, అనగా 'ఇప్పుడు' తత్త్వాన్ని అంగీకరించటం లేదు, మన ఎఱుకను మనం ఆమోదించటం లేదు, మనం ఎప్పుడూ ప్రక్కకు చూస్తున్నాము.

సమస్తాన్నీ ఏకాత్మ స్వరూపముగా అనగా అంతటినీ ఒకటిగా, ఇప్పుడును ఇప్పుడుగా మనం చూడటానికి ఇష్టపడటం లేదు. మనం చూడటం లేదు కనుక మనం దానినుండి తప్పుకొని పోతున్నాము. సూక్ష్మాతి సూక్ష్మమయిన ఈ ప్రాతికూల్యము కారణంగా మనం ఆత్మానుభవమునకు దూరంగా పోతున్నాము. దానితో మనకున్న కోరికలు, అభిరుచులు, లక్ష్యాలు - వీని నన్నింటినీ ఆత్మానందమునకు ప్రత్యామ్నాయములుగా మనం గ్రహిస్తున్నాం. ఆత్మానందమునకు ప్రత్యామ్నాయములుగా మనం మన ఈ కోరికలను తీర్చుకుంటున్నాము. దీనివల్ల ఏమవుతున్నది? మనకు అఱకొఱగా ఆనందం లభిస్తున్నది, కాస్త తృప్తి, కాస్త అసంతృప్తి. మనం ఆత్మానందాన్ని కోరుకుంటూ, అనాత్మ విషయాల ద్వారా దాన్ని పొందాలని చూస్తున్నాము.

'ఇప్పుడు' ఉన్న స్థితి సరియైనది కాదు అని మన దృఢాభిప్రాయము. అందుచేత 'ఇప్పుడు' మనం శాంతంగా ఉండము. ఇప్పుడున్న స్థితినుండి మనం నిరంతరం దూరంగా జరిగి జరిగి పోతుంటాము, అది ఇప్పటికంటే బాగుంటుందనే భ్రాంతితో. అంటే ప్రస్తుత క్షణం ఎప్పుడూ మనకు తప్పించుకోవలసినదిగా గోచరిస్తుంది. మనం ఒక అలపైనుండి ఇంకో అలపైకి ఎప్పుడూ దూకుతూ ఉంటాము. దేశకాలములయందు మన ఈ నిరంతర పయనం కొనసాగుతూనే ఉంటుంది, అంతిమమయిన అల కోసం ఎదురు చూస్తూ. ఆ అంతిమ మయిన అల, అది జ్ఞాన తరంగంగా ఉండి మన దాహాన్ని తీరుస్తుందనీ, అది మనకు నీటిని తెచ్చిపెడుతుందనీ అనుకోవటం వల్ల ఇలా చేస్తుంటాము. నీటికోసం ఎప్పుడూ మనం ఇంకో అలపైకి దూకుతూ దూకుతూ, ఇప్పుడు మనం ఏ అలపైన ఉన్నామో ఆ అలలో ఉన్న నీటివైపు చూడనే చూడము. ఇలా నిరంతరం అన్వేషించటం ద్వారా దాన్ని మనం ఎప్పటికీ పోగొట్టుకొంటున్నా మన్నమాట. ఎప్పుడూ వెతకటం అంటే ఎప్పటికీ పోగొట్టుకోవటమే.

ఇప్పటి నీ అనుభవమునుండి దూరంగా జరిగిపోవటం అంటే ఇప్పటి నీ అనుభవమూ, నీవూ వేరు వేరు అని భావిస్తున్నావని అర్థం. రెండూ భిన్నమయినవిగా తోస్తాయి నీకు.

'ఇప్పుడు' నుండి దూరంగా నిరంతరం జరిగిపోతుండటం ద్వారా నీవు ఇప్పుడు కంటె భిన్నంగా ఉన్నావన్న భ్రాంతిని ఇంకా ఇంకా దృఢతరం చేసుకుంటున్నావు. ఇప్పుడు నీ ముందున్న జగత్తునుండి, నీ చుట్టూ ఉన్న పరిస్థితులనుండి తప్పించుకోవాలని చూస్తున్న నీకు ఈ జగత్తు భిన్నముగా తోస్తున్నది. ఈ విధంగా మన ఎదుట ఉన్న ఈ జగత్తుకూ, మనకూ నడుమ పెద్ద అడ్డుగోడను నిర్మించుకుంటున్నాము. ఒక వైపు మనం ఉన్నాం. అవతలివైపు జగత్తు ఉంది. జగత్తు మనకు బాహ్యంగా ఒక దృశ్యంగా తోచటమే, మనకు భిన్నంగా తోచే 'ఇప్పుడు' తత్త్వము పట్ల మనలో వుండే వ్యతిరేకతకు కారణం.

'ఇప్పుడు' నుండి దూరంగా పోవటం అంటే ఆత్మస్థితి నుండి మనం వేఱు అవుతున్నామనే అర్థం. మనం ఇప్పటి మన అనుభవం నుండి వైదొలగుతున్నామంటే మనం జగత్తును రెండుగా విభజిస్తున్నాము. ఒకటి - మనలోపలి అనుభవం - ద్రష్టగా; రెండు- బాహ్యజగత్తు- దృశ్యముగా. మనమూ, జగత్తూ - వీనిని రెండుగా చీల్చి భ్రాంతిమయ మయిన ఒక సరిహద్దు రేఖను గీస్తున్నాము.

ఈ సరిహద్దు రేఖ, ఈ భ్రాంతి, ద్రష్ట అయిన నీకూ, దృశ్యమయిన జగత్తుకూ నడుమ ఏర్పడ్డ రేఖ. దీనితో రెండు విరుద్ధ తత్త్వములని భావింపబడే వాని నడుమ యుద్ధం మొదలయింది. ఇంకో విభజన కూడా దీనితో మొదలయింది. మనం ఎదుర్కొనే ఈ ప్రస్తుత క్షణము, ఇంతకంటె బాగుంటుందని భ్రమించే రేపటి క్షణము. వీని నడుమ అన్న మాట. మనం జరిగి ముందుకు పోయేందుకు ఇంకో సమయం అంటూ ఒకటి ఉన్నదని భావించి, మనం కదలిపోతుంటాము కాలంలో. అంటే కాలాన్ని విభజించి చూస్తాము, కాలాన్ని సృష్టించుకుంటాము. కాల పరిధికి లోనుగాని ఇప్పటి అనుభవం నుండి కదలిపోతూ ఈనాడు, రేపు అని కాలాన్ని విభజిస్తాము. నిత్య వర్తమాన కాలమును తిరస్కరిస్తూ, దానిని వర్తమానం లోని ఈ క్షణానికి కుదించి చూస్తాము. అప్పుడు మన అనుభవాలు ఒకదాని తరువాత మరొకటి వరుసగా కాల ప్రవాహములో సాగిపోతూంటాయి. 'ఇప్పుడు' అయిన వర్తమాన కాలం నుండి మనం వైదొలగి పారిపోతున్నాము.

ఒకవైపు మనం జగత్తునుండి వైదొలగి పోయేందుకు ప్రయత్నిస్తుంటే, జగత్తు మననుండి వైదొలగి పోతున్నట్లుగా మనకు గోచరిస్తుంది. నిత్య వర్తమానమునకు సరిహద్దురేఖ ఏర్పడుతుంది. అప్పుడు నిత్యవర్తమాన కాలమునకు అటువైపు భూతకాలము, ఇటువైపు భవిష్యత్ కాలము ఏర్పడి, ఈ రెంటి నడుమ నిత్య వర్తమాన కాలము, వర్తమాన క్షణముగా కుదించుకు పోతుంది. 'ఇప్పుడు' నుండి వైదొలగి పోవటం అంటే, దాని ముందు, దాని తరువాత అని రెండు కాలములను సృజించుకోవటం. మనం భూతకాలములో నుండి బయటకు వచ్చి, భవిష్యత్కాలములోకి అడుగు పెట్టబోతున్నాము అని అనుకుంటాము. వర్తమాన కాలము కదలిపోతున్న క్షణముగా కుదింపబడుతుంది. ఇలా క్షణములు గడచిపోతుంటాయి.

సర్వానుభవాలనూ మొత్తంగా, ఒకటిగా, ఇప్పుడు అవి ఉన్నవి ఉన్నట్లుగా భావించటాన్ని మనం వ్యతిరేకిస్తుంటాము. ఎప్పుడూ కదలి పోతుండటమే మన తత్త్వంగా గోచరిస్తుంది. దీనితో కష్టాలు మనలను చుట్టుముడతాయి.

7

ఇప్పుడు సాధకుడు ఒక సత్యాన్ని గుర్తిస్తాడు. అతనికి విరోధి ఎవరో తెలుస్తుంది. తెలిసిన తరువాత అతనికి తత్త్వం ఏమిటో అవగతమవుతుంది. తాను చేయవలసింది ఏమిటో తెలుస్తుంది. నిజానికి తానేమీ చేయనవసరం లేదు. అంతా సవ్యంగానే ఉన్నది. ఉన్నది ఉన్నట్లుగానే ఉన్నది. ఇక ఇప్పుడు ఏమి చేస్తాడు? తాను దేన్ని అయితే ఇప్పటివరకు తిరస్కరిస్తూ వచ్చాడో, ఆ తిరస్కృతిని ఇప్పుడు తిరస్కరిస్తాడు. దేన్నీ తిరస్కరించక పోవటమే ఉన్నది ఉన్నట్లు భావించటం. నేను దేనినీ వ్యతిరేకించనక్కర లేదు. నేను వ్యతిరేకిస్తున్నదానిని కూడా వ్యతిరేకించనక్కరలేదు. జ్ఞాన స్థితి ఇదే. ఇది ఎలా ఉంటుంది? చాలా కాలంగా నిద్రపోతున్నవాడు ఉన్నట్లుండి మేల్కొన్నట్లు ఉంటుంది. తనకు ఇన్నాళ్లూ ఏదయితే తెలిసి ఉందో దానిని తెలుసుకొన్నట్లు ఉంటుంది. తాను వేరే ఒక వ్యక్తిగా, ఒక జీవునిగా లేడు. అంతా తానే. తానెప్పుడూ జన్మించి ఉండలేదు. అందుచేత తనకు మరణం అనేది లేదు. అన్ని వైపులా ఒకే ఒక చైతన్యం, ఒకే ఒక ఆత్మ ఉంది. అది అన్ని దిక్కులలోనూ వ్యాపించి వుంది. కేవలమై ఉంది. సర్వ వ్యాప్తముగా వుంది. ప్రకాశిస్తూ ఉంది.

సర్వతోముఖమై ఉంది. అదే అన్నింటికీ మూలము. అన్నీ అదే. క్షణం తరువాత క్షణం అదే అయి ఉంది. ఇది జగత్తు కంటె ముందే ఉంది. ఇప్పుడు ఈ జగత్తుగా కూడా ఉంది. జగత్తు అనే సరస్సులో అలలుగా కన్పిస్తున్నాయి. అన్నీ.

సముద్రంలోని అలలపైన -ఒక అలమీద నుండి ఇంకో అలమీదికి- దూకుతున్న మనకు అది ఇక అసంభవం అవుతుంది. ఎక్కడ దూకినా నీరే కదా ఉన్నది. నేను ఏం చేసినా ఒక అలపైనుండి ఇంకో అలమీదికి పోయినట్లే అవుతుంది కదా! నీటికోసం అలలలో వెతుకుతున్నట్లు అవుతుంది కదా! ఎందుకు ఆ పని? సాధనలోని రహస్యం యావత్తూ ఈ అంశంలో దాగి ఉంది. అంటే నేను ఏమి చేసినా అది అలలపై గెంతటమే అవుతుందని తెలిసినప్పుడు, ఏమి చేసినా అది ఉన్న దాన్ని వ్యతిరేకించటమే అవుతుందని తెలిసినపుడు, నేను వ్యతిరేకిస్తూనే వుండవచ్చు అనగా అలలపైన దూకుతూనే ఉండవచ్చు - దూకినా దూకకపోయినా తాను నీటిలోనే కదా ఉన్నాడు. అంటే తాను ఏమి చేసినా, ఏమి చేయకపోయినా, అది ఉన్నదాన్ని ఉన్నట్లు అంగీకరించకపోవటమే అవుతుందని తెలిసినప్పుడు, సముద్రజలాలలో తానొక అజ్ఞాన తరంగాన్ని అనీ, జ్ఞానతరంగాన్ని వెతుక్కుంటూ పోవాలనీ, లేదా అలగా ఉన్న తాను నీటికోసం ఎక్కడో వెతుక్కుంటూ పోవాలనీ, అనుకోవటం భ్రాంతి అని తెలుస్తుంది. ఆ భ్రాంతి ఇప్పుడు నశించి పోతుంది. ఆత్మగా ఉన్న తాను, ఆత్మకై వెతకుతూ పోతున్న తాను ఒక్కడే అని తెలుస్తుంది. నిత్య సిద్ధమయి ఉన్న ఆ తత్త్వమూ, దాన్ని సాధించుకోవాలని తపన పడుతున్న సాధకుడు - ఇరువురూ ఒకరే అనే సత్యం సాక్షాత్కరిస్తుంది. సాధన ఒక ముగింపుకు వస్తుంది. సాధనయే సిద్ధావస్థ అని తెలుస్తుంది.

నీవు నీ ప్రస్తుతానుభవాన్ని ఇక వ్యతిరేకించవు, తిరస్కరించవు. ఈ క్షణం లోని నీ అనుభవము, ఈ జగత్తు, నీవు - అంతా ఒకే తత్త్వము. ఇపుడు లోపల, బయట అంటూ వేరేగా ఏదీ లేదు. ఇక్కడ, అక్కడ అనే తేడా లేదు. ఇప్పుడు, అప్పుడు అనే వ్యత్యాసము లేదు. అలలమీదుగా దూకడం పోయి అంతా ఒకే అల అవుతుంది. ఆ అల నీరే అని తెలుస్తుంది. అది సర్వత్ర, సర్వముగా, సర్వదా ఉన్న తత్త్వము అని అనుభవ గోచరమవుతుంది.

'ఇప్పుడు' నుండి తప్పించుకోవడం ఆగిపోతే, ఇక మిగిలింది ఏమిటి? అంతా ఇప్పుడే. మరొకటి లేదు. ఆది లేదు, అంతము లేదు. వెనుక లేదు. ముందబ లేదు. గత స్మృతులూ, భవిష్యదాకాంక్షలూ - ఇవి అన్నీ వర్తమాన అనుభవాలుగా గోచరిస్తాయి. ఈ క్షణము, లేక 'ఇప్పుడు' అనే దాని సరిహద్దు గోడలు కూలిపోయి, అన్నీ ప్రస్తుత క్షణంలో ఇమిడిపోతాయి. అంతా వర్తమాన క్షణమే. మరొకటి లేదు. అలాగే అంతా 'ఇక్కడే' అయినప్పుడు నేను పోయేందుకు చోటు వేరే ఎక్కడా లేదు. మనం దేన్ని అయితే తిరస్కరిస్తూ వచ్చామో అది అంతా నిత్య వర్తమాన కాలంలోని అవిభాజ్యమయిన అంశము అని తెలిసినపుడు అంతా ఒకే తత్త్వము. అన్నీ నిత్య వర్తమానములోని కదలికలే, సముద్రజలాలలోని అలలే. ఆ అలలు ఇప్పుడు స్వేచ్ఛగా ముందుకు వస్తూంటాయి, ఒడ్డుకు తగిలి విరిగి పడుతూంటాయి. ఒడ్డున ఉన్న వన్నీ నీటితో తడుపబడుతూంటాయి. ఎంత అద్భుతం?

8

ఇక నా నిజమయిన ఆధ్యాత్మిక సాధన రోజు 24 గంటలలో ఒక 20 నిముషాలు చేస్తే ముగిసేది కాదు, రోజు గంట గాని, రెండు గంటలు గానీ చేస్తే ముగిసేది కాదు లేదా రోజు 6 గంటలపాటు చేస్తే ముగిసేది కాదు. అది ఏదో ఉదయం కాసేపు, సాయంత్రం కాసేపు చేస్తే ముగిసేది కాదు. లేదా ఆదివారం నాడు చేస్తే సరిపోయేది కాదు. ఆధ్యాత్మిక సాధన అంటే అది ఇతరములయిన నీ దైనందిన వ్యవహారాల నడుమ వేరేగా ఉండే వ్యవహారం కాదు. నీవు సాగించే సకల వ్యవహారాలకూ మూలాధారమై ఉండి, వానిని నడిపించే తత్త్వము. రోజులో 24 గంటలూ నీవు జీవించవలసినట్టిది, ఊపిరిగా పీల్చవలసినట్టిది, ఊహించవలసినట్టిది, ఆ విధంగా సాధన చేయవలసినట్టిది. ఆత్మ సాక్షాత్కారం అంటే నీ యావత్తు వ్యక్తిత్వం ఒక దేహానికి పరిమితమై ఉండకుండా, సకల జీవులలో, సకల చరాచరములలో వ్యాపించియున్న ఏకమయిన తత్త్వముగా అనంతముగా విస్తరించినట్టిది. ఆధ్యాత్మిక సాధన నీ విప్పుడు ఉన్నట్లున్న నీ సహజ స్థితి, ఈ క్షణంలో నీ స్థితి, ఇక్కడ నీవున్నట్లున్న నీ స్థితి.

# ఇప్పుడే ఇక్కడే ముక్తులం మనం



నిజమయిన ఆధ్యాత్మిక సాధన రోజూ 24 గంటలలో ఒక 20 నిముషాలు చేస్తే ముగిసేది కాదు, రోజూ గంట గాని, రెండు గంటలు గానీ చేస్తే ముగిసేది కాదు లేదా రోజూ 6 గంటలపాటు చేస్తే ముగిసేది కాదు. అది ఏదో ఉదయం కాసేపు, సాయంత్రం కాసేపు చేస్తే ముగిసేది కాదు. లేదా ఆదివారం నాడు చేస్తే సరిపోయేది కాదు. ఆధ్యాత్మిక సాధన అంటే అది ఇతరములయిన నీ దైనందిన వ్యవహారాలనడుమ వేరేగా ఉండే వ్యవహారం కాదు. నీవు సాగించే సకలవ్యవహారాలకూ మూలాధారమై ఉండి, వానిని నడిపించే తత్త్వము. రోజులో 24 గంటలూ నీవు జీవించవలసి నట్టిది, ఊపిరిగా పీల్చవలసినట్టిది, ఊహించవలసినట్టిది, ఆ విధంగా సాధన చేయవలసినట్టిది.

రమణ భక్తమండలి ట్రస్టు (రి), బెంగళూరు.